

# కొత్త సుప

## నీలి డిటర్జెంట్ బార్



మురికితో మీ నిరంతర పోరాటం ముగిసినట్లే. న్యూ సుప డిటర్జెంట్‌బార్ సబ్బు నురుగులో తెల్లదనం బూడిదరంగు మురికిని వదిలించి మీ బట్టలకు తెల్లదనాన్ని ప్రకాశాన్ని తిరిగి ప్రసాదిస్తుంది. తెల్ల బట్టలు మరింత తెల్లగాను, రంగుబట్టలు మరింత ఆకర్షణీయంగాను, కనిపిస్తాయి. అన్నిరకాల దుస్తులకు ఇది అత్యుత్తమం. మరే ఇతర డిటర్జెంట్‌బార్ కన్న న్యూ సుప డిటర్జెంట్‌బార్ చాలా పొదుపైనది.




**మీ బట్టలకు తెల్లని తెలుపును కాంతిని తిరిగి తెస్తుంది**

HARYANA DETERGENTS LTD



maa HDL 1b-79 Tel

లోకం పోకడ. ఉమెన్




ఇందిరమ్మకు - ఉత్తరాదిలో దక్షిణాదిలో కూడా బలం వున్నదని నిరూపించడానికే రెండు ప్రాంతాలనుంచీ పోటీ చేస్తున్నారు!

ఒకవేళ - ఉత్తరాదిన ఓడినా... దక్షిణాదిన గెలవవచ్చుని...










# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాధుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :

[1938 - 1972]

శుక్రవారం : 14-12 '79

సిద్ధార్థినామ సం. మార్గశిర బ. దశమి

సంపుటము 73 : సంచిక 16

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41-60

ఆరు మాసాల చందా రు. 20-80

విడి ప్రతి వెల 75 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక



# 3 నెలలు వచ్చిన తర్వాత, పాలు మాత్రం యిస్తే చాలదు



## డాక్టర్లు సిఫార్సు చేస్తారు



# ఫారెక్స్®

### మీ పాపాయికి ఆదర్శవంతమైన ఘన ఆహారం

**డాక్టర్లు ఫారెక్స్ సిఫార్సు చేస్తారు! ఎందువల్ల?**

ఎందుకంటే, ఇది మీ పాపాయి ఘన ఆహారం తీసుకోవడం ప్రారంభించే సమయంలో అతడి అవసరాలను తీర్చే సంపూర్ణ సంతులిత ఆహారం. పాపాయి సున్నితమైన జీర్ణకోశానికి సరిగ్గా తగిన ఆహారం.

**ఫారెక్స్ ఏ విధంగా పాపాయికి తగిన సంతులిత ఆహారం?**

ఫారెక్స్ మెదడు, శరీరం పెరుగుదల కోసం తగినన్ని సులభంగా జీర్ణమయ్యే ప్రొటీన్లను, శక్తి కోసం కార్బోహైడ్రేట్లను, దృఢమైన ఎముకలు, గట్టి పళ్ళు పెరిగేందుకు తగినంతగా కాల్షియం, ఫాస్ఫరస్, విటమిన్ డి అందిస్తుంది. అన్నిటికంటె ముఖ్యంగా, పాపాయి రక్తాన్ని ఆరోగ్యంగా ఉంచేందుకు తగినంత ఐరన్ అందజేస్తుంది.

**3 నెలలు వచ్చాకనే ఎందుకు?**

ఈ వయస్సులో పాపాయికి నమలడం అలవాటు కావాలి. లేకపోతే నమలకుండా మింగివెయ్యడం వల్ల కడుపు నొప్పి వచ్చి అతడి పెరుగుదల దెబ్బ తినవచ్చు.

అంతే కాకుండా, 3 నెలలప్పుడు పాపాయి జీర్ణకోశం ఇంకా సున్నితంగానే ఉంటుంది. అందుకే మామూలు ఘన ఆహారాలకు బదులు అతడికి ప్రత్యేకంగా తయారు చేయబడిన—అంటే సులభంగా జీర్ణమయ్యే—పిల్లల ఘన ఆహారం అవసరం.

**'పెద్దలు తినే' ఆహారాన్ని ఎప్పటినుంచి ఇవ్వవచ్చు?**

పాపాయి మొదటి సారిగా తప్పటడుగులు వేసినప్పుడు అతడు 'పెద్దలు తినే ఆహారాన్ని తీసుకోగలుగుతాడు. కొంచెం ఆలోచించి, మీ పాపాయి తినేవాటన్నిటిలో ఫారెక్స్ కలిపి ప్రేమగా పెట్టండి.

ఇప్పుడు అదే శ్రేష్ఠమైన ఫారెక్స్ కొత్త 400 గ్రాముల డబ్బాలో వస్తోంది.




## పత్వరమైన, సంపూర్ణమైన పెరుగుదల కోసం పాపాయికి ఆదర్శవంతమైన ఘన ఆహారం

CASGLF-2-233 TL

# ఉత్తరాలు

### ముఖచిత్రం

9.11.79 తేదీనాటి అందాలనటి సుజాత ముఖచిత్రంతో వెలువడిన మా అభిమాన ఆంధ్ర పత్రిక వారపత్రిక మాకు చాల నచ్చింది.

గమ్యం, ఎవరిది నేరం కథలు చాలా బాగున్నాయి.

సుదూర తీరాలు సీరియల్ చాలా ఇంటరెస్టింగ్‌గా సాగుతున్నది. ప్రేమపాశం ముగింపు మాకు నచ్చలేదు. సినిమా విశేషాలు బాగానే ఉన్నాయి.

విజయలక్ష్మి (బిరువూరు)

### యక్షప్రశ్నలు

9.11.79 వారపత్రికకు పై విభాగములో మొదటి చిత్రమునకు యక్షుని సంభాషణ ప్రారంభములో ధర్మరాజును కౌరవేంద్రా! అని సంబోధించాడు. ధర్మరాజు కౌరవేంద్రుడెట్లయ్యెనో? కౌరవాగ్రజుని కౌంతేయుడు కౌరవేంద్ర అని సంబోధించుటలో ఏదైనా ఇతివృత్తముగలదా లేక పొరపాటా?

ఎం. వి. ఎస్. ప్రకాశరావు [బిలాసిపూరు]

### జవాబు

ధృతరాష్ట్రుడు, పాండురాజు అన్నదమ్ములు మరియు కురు వంశ రాజులలో శ్రేష్ఠులు... ధృతరాష్ట్రుని కుమారులు ధార్తరాష్ట్రులు. పాండురాజు కుమారులు పాండవులు. అయితే పాండురాజు చనిపోయినందున తల్లి కుంతీదేవి పేరుతో పాండవులను కౌంతేయులుగా కూడా ఎక్కువగా ప్రస్తావించడం జరిగింది.

ధృతరాష్ట్రుని కుమారులైనా, పాండురాజు కుమారులైనా వారు కురువంశీయులే, అనగా కౌరవులే. అయితే చదువరుల సౌలభ్యం కోసం వ్యాసమహర్షి భారతంలో వారిని వారి వారి తల్లిదండ్రుల నామాలతో ప్రస్తావించడం జరిగింది.

9-11.79 వారపత్రికలో ప్రచురింపబడిన బొమ్మల మహాభారతంలోని మొదటి బొమ్మలో యక్షుడు ధర్మరాజును కౌరవేంద్రా! అని సంబోధించుట కూడా నా స్వంత అభిప్రాయం కాదు. అది చెన్నపురి వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ వారు ప్రచురించిన కవిత్రయముమరి శ్రీమదాంధ్ర భారతము అరణ్యపర్వము సప్తమాశ్వాసములో 418వ పద్యమును అనుసరించి అలా సంబోధించడం జరిగింది. ఆ పద్యమిలా ఉంది...

ఆ. కౌరవేంద్ర బకము గాను నే విను మొక్క, యక్షవరుండ విచట నున్నదీయు విక్రుతి జేసి పడిరి నీ తమ్ములందరు, ననుచు నా క్షణంబ యతని యెదుర.

మండపాక సీతారామ ఆంజనేయులు [తణుకు]

### కథలు

రూప ముఖచిత్రంతో వెలువడిన 23.11.79 సంచిక అపూర్వంగా ఉంది. కథల్లో ఇంకోసారి రా! కథ బాగుంది. కాని ఇది సమస్యను పరిష్కరించలేదు. అలాగే సుదూర తీరాలు సీరియల్ చాలా బాగుంది.

కందికట్ల సూర్యపద్మిని [నెల్లూరు]

* * *

16.11.79 నాటి ఆంధ్ర సచిత్ర వార పత్రిక చాలా బాగుంది. ప్రేమపాశం సీరియల్ చాలా ఇంట్రెస్టింగ్‌గా సాగుతూంది. బెల్టులో ఉండి శిక్ష అనుభవిస్తున్న మాకు మీరు ప్రచురిస్తున్న కథలు, కార్టూన్లు ఎంతగానో నచ్చుతున్నాయి. సినిమా విశేషాలు చాలా బాగున్నాయి. మధ్య పేజీలోని సెట్ గాసిప్ చాలా ఆకర్షణీయంగా ఉన్నాయి. కె. రామలక్ష్మిగారు ఎప్పుడు స్త్రీలను పొగడడం తప్ప మరేమీ చెప్పరు.

ఆశేటి, బుచ్చిబాబు, సి.హెచ్. సుధాకర్, ఎం. విద్యాసాగర్ (పరంటి)

### సీరియల్

23.11.79 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ఆకుపచ్చని చీరెలో అందాలరాశి సరిదిద్దుకొన్న రూప ముఖచిత్రం ఆనందానుభూతినిచ్చింది. ప్రాక్టీసు పెట్టిచూడు సీరియల్ ప్రారంభం మనోహరకరించింది. కొత్తగా ప్రాక్టీస్ పెట్టే డాక్టర్ల అవస్థలు ఎలా ఉంటాయో చాలా చక్కగా తమాషాగా వివరించారు రచయిత.

ఎల్. ప్రఫుల్ల చంద్ర, శ్రీమతి శకుంతలా వెంకట నారాయణ, రఘునాథ్, రాము, లీలావతి, యోగీశ్వరయ్య, నారాయణమ్మ (ధర్మవరం)

* * *

16.11.79 ఈ వారంతో ముగిసిన సీరియల్ ప్రేమపాశం చాలా బాగుంది. మనిషి భవిష్యత్తు గురించి ఎన్నో కలలు కంటాడు. కానీ ఎప్పుడేం జరుగుతుందో తెలుసుకోలేడు. విధి ఆడించే వింత నాటకానికి తల వంచక తప్పదు అన్న కఠిన సత్యాన్ని ఈ సీరియల్ ప్రతిబింబించింది. విధి ఆడిన వింత నాటకంలో ఊహించని విధంగా డాక్టరు శాంతి మరణించడం తీరని బాధ కలిగించినా, సీరియల్ మాత్రం తృప్తిగా ముగిసింది.

టి. కమలాకర ప్రసాద్ (నూజివీడు)

* * *

తే. 23.11.79 నాటి మీ (మా) ఆంధ్ర సచిత్ర వారపత్రికలోని సుదూర తీరాలు సీరియల్ చాలా రసవత్తరంగా ఉంది. ఇంకోసారి రా! కథ ద్వారా నేడు ఫార్వర్డు జాతికి జరుగుతున్న అన్యాయాలను కళ్లకు కట్టినట్లు చూపించారు.

ఎం. జగన్మోహనరావుపట్నాయక్,
హైమవతి, [విశాఖపట్నం]

* * *

23.11.79 నాటి రూప ముఖచిత్రంతో వెలువడిన మా అభిమాన ఆంధ్రపత్రిక అత్యంత ఆకర్షణీయంగా ఉంది. ప్రాక్టీసు పెట్టిచూడు శ్రీరంగం గారి సీరియల్ మమ్మల్ని మొదట్లోనే ఆకట్టుకుంది. సుదూర తీరాలు సీరియల్ ఎంతో ఇంటరెస్ట్‌గా సాగుతుంది. కర్తవ్యం, ఆధునిక కవి కథలు చాలా బాగున్నాయి.

మాదల శివరామప్రసాద్, రవిప్రసాద్ (పొన్నూరు)

* * *

నటి రూప ముఖచిత్రముతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వార పత్రిక అత్యంత ఆకర్షణీయంగా నున్నది. ప్రాక్టీసు పెట్టిచూడు సీరియల్ హాస్య భరితముగానున్నది. కథలన్నీ బాగున్నాయి.

ఎన్. శ్రీనివాస్, రమణ, కృష్ణ (మచిలీపట్నం)

అదేమిటో! పోస్టుకార్డు రాగానే జ్వరమూ మలేరియా కావచ్చు... క్లోరోక్విన్ బిళ్ళలు వాడండి - అని చదువుతావే..

తులసీరామ్

# హైదరాబాదు నోట్‌బుక్

## తెన్నేటికి జోహార్లు!

రాజకీయ చిత్తశుద్ధి మూర్తీభవించిన శ్రీ తెన్నేటి మరిలేరు.

తెన్నేటి రామునికి లక్ష్మణునిలాగ ప్రకాశం గారి సహచరుడుగా, రాజకీయ ఋషిగా ఆరు దశాబ్దాలు గడపిన కాలం తలచుకుంటేనే ఆశ్చర్యం కలుగుతుంది. తెన్నేటి విశాఖజిల్లా లక్కవరం 1895 లో జన్మించారు. కాకినాడ లోను, విశాఖలోను చదివి, 1918 లో మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో ఆనర్సు పట్టం, 1920 లో మద్రాసు విశ్వవిద్యాలయంబి.ఎల్ పట్టా పుచ్చుకుని, మద్రాసు హైకోర్టు అడ్వకేటుగా విశాఖలో వకాల్తా ప్రారంభించి, 1922 లో వకాల్తా వదలి, గాంధీజి నాయకత్వంలో ప్రారంభమయిన సహాయ నిరాకరణోద్యమంలో దూకారు. సంవత్సరం పాటు గుజరాత్ విద్యాపీఠంలో ఆర్థిక శాస్త్రోపాధ్యాయులుగా పనిచేశారు. జిల్లా కాంగ్రెస్ సంఘానికి, జిల్లా స్వరాజ్య పార్టీకి అధ్యక్షుడై 1930 లో కారాగారం అనుభవించారు. 1937 లో మద్రాసు శాసనసభకు ఎన్నికై రాజగోపాలాచారి మంత్రి వర్గంలో రెవెన్యూ మంత్రి శ్రీ ప్రకాశం గారికి పార్లమెంటరీ సెక్రటరీగా పనిచేశారు. 1940, 42 లో కారాగారశిక్ష అనుభవించి, 1946లో మరల శాసనసభకు ఎన్నికయ్యారు. ప్రకాశం మంత్రి వర్గంలో చీఫ్ పార్లమెంటరీ సెక్రటరీ అయ్యారు. 1947 నుంచి విశాఖ మునిసిపల్ చెయిర్మన్‌గా వున్నారు. 1951 లో కాంగ్రెస్ నుంచి వైదొలగి 1952 లో కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ పక్షాన శాసనసభకు ఎన్నికై, 1953 లో పొట్టి శ్రీరాములు నిర్యాణం పట్ల గౌరవ సూచకంగా శాసనసభ్యత్వానికి రాజీనామా యిచ్చారు. ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తర్వాత తొలి మంత్రి వర్గంలో ఆర్థికమంత్రిగా వున్నారు. 1956 లో కంపెనీ లా అడ్వయిజరీ సంఘం అధ్యక్షుడుగను, 1959 లో అఖిలభారత కాఫీబోర్డు అధ్యక్షుడుగను నియమితులయ్యారు. 1962 లో నూజివీడు నుంచి ఆంధ్రప్రదేశ్ శాసనసభకు ఎన్నికయి నేషనల్ డెమొక్రాటిక్ పార్టీ నాయకులయ్యారు. 1966లో శాసనసభకు రాజీనామా యిచ్చి విశాఖ ఉక్కు కర్మాగారం స్థాపనకై అఖిలపక్షోద్యమం ప్రారంభించారు. 1967 లో లోక్‌సభకు ఎన్నికయారు. 1972 లో ప్రత్యేకాంధ్రోద్యమానికి నాయకత్వం వహించి 21 రోజులు కారాగారశిక్ష అనుభవించారు. ఆంధ్రవిశ్వవిద్యాలయం ఆయనను 1978 లో డాక్టర్ ఆఫ్ లాస్ బిరుదంతో గౌరవించింది. ఆయన తామ్రపత్రాన్ని, పద్మభూషణ బిరుదాన్ని నిరాకరించారు. తన ఎనిమిదెకరాల భూమిని సర్వోదయ భూదానోద్యమానికి దానమిచ్చారు. నవంబర్ 10వ తేదీ రాత్రి తీవ్రంగా వచ్చిన గుండెపోటు ఆయనను కబళించింది. గవర్నర్ శ్రీ అబ్రహాం, ముఖ్యమంత్రి డాక్టర్ చెన్నారెడ్డి, పలువురు నాయకులు ఆయన మరణానికి సంతాపం ప్రకటించారు.

## డాక్టర్ ఎస్. గోపీ :

డాక్టర్ ఎస్. గోపీ నానక్‌రాం భగవాన్‌దాస్ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులు. పరిశోధనోత్సాహం, సత్యజిజ్ఞాస పొంగులు వారుతున్న యువకులు. వేమన జీవితం, కవిత్వం విషయంగా సిద్ధాంత వ్యాసం సమర్పించి ఉస్మానియా విశ్వవిద్యాలయం నుంచిడాక్టరేట్ బిరుదం పొందారు. ఇంతవరకు వేమనను గురించి వివిధ దృక్కోణాలలో విమర్శలు జరిగాయి. సి. పి. బ్రవున్ వేమన కవితా సారళ్యానికి, భావతీక్ష్ణతకు ముగ్ధుడై దాదాపు 15 సంవత్సరాలపాటు కృషిచేసి, పద్యాలు సేకరించి, వాటికి ఆంగ్లానువాదం వ్రాసుకొని ప్రచురించారు. వంగూరు సుబ్బారావుగారు ఎంతో పరిశోధన చేశారు. ఆయన పరిశోధనలో ఎక్కువగా వేమన యెక్కడివాడనేదే ప్రధానాంశమైంది. వేమనకు సాహిత్యంలో గొప్పస్థానం కల్పించిన వారు చిరస్మరణీయులు డాక్టర్ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ గారు. డాక్టర్ గోపీ ఈ దిశలో ప్రగతి శీలురై ప్రాచీన తమ తాళపత్ర గ్రంథాన్ని 1691 నాటి పరిశీలించి, దానితో తక్కిన తర్వాతి ప్రతులను తైపారు చేసి, ఏవి మూల పద్యాలో, ఏవి ప్రక్షిప్తాలో నిర్ణయించి, సత్యాన్ని సాక్షాత్కరించుకునే ప్రయత్నం చేశారు. వేమనలోని మానవత్వాన్ని వెలువరించారు. డాక్టర్ గోపీ ఇకముందు కూడ గొప్ప పరిశోధనలతో ఆంధ్రావళికి విజ్ఞానం పంచిపెడుతుంటారని ఆశిస్తున్నాను.

## ఆనందనగర్ బాలల ప్రతిభ :

అంతర్జాతీయ బాలల సంవత్సరం సందర్భంగాను, నవంబర్ 14న అఖిలభారత బాలలదినోత్సవం సందర్భంగాను జంటనగరాలలో బాలసంఘాలు, బాలానంద సంఘాలు పెక్కు వినోద సాంస్కృతిక కార్యక్రమాలు జరిపాయి. ఆనంద్‌నగర్ సంక్షేమ సంఘం ఆధ్వర్యాన ఆనంద బాలానంద సంఘం నాటికలు, నాట్యాలు, ఏకపాత్రాభినయాలు ప్రదర్శించి, తమ సంఘం బాలబాలికల ప్రతిభను చాటింది. ఇద్దరు లలితలు, పరీక్ష, చిట్టిచిలిపితనం, శ్రావణభాద్రపదాలు నాటికలను ప్రదర్శించిన బాలబాలికలు ఉత్తరోత్తరా గొప్ప నటులు కాగలరని, నృత్యాలలో పాల్గొన్నవారు గొప్పనర్తకులు,నర్తకీమణులు కాగలరని తమ ప్రతిభతో నిరూపించుకొన్నారు. ఈ ఉత్సవానికి శ్రీ తిరుమల రామచంద్ర అధ్యక్షత వహించారు. ఉపన్యాసకులు శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, ముఖ్య అతిథిగా విచ్చేసిన డిప్యూటీ ఎడ్యుకేషనల్ ఆఫీసరు శ్రీ వి. విష్ణుజనార్దన్ నెహ్రూ జీవితవిశేషాలు గురించి బాలల కర్తవ్యాన్ని గురించి ఉద్బోధించారు. సమావేశం ప్రారంభంలో శ్రీమతి ఎం. భారతి స్వాగతం చెప్పారు.

*  *  *

కిన్నెర ఆర్ట్ థియేటర్స్ వారు నవంబర్ 11నుంచి 14వరకు బాల సాంస్కృతోత్సవాలు నిర్వహించారు. ఈ ఉత్సవాలు 11న త్యాగరాయ గానసభలో పోలీసుఇన్‌స్పెక్టర్ జనరల్ శ్రీ ఎం. వి. నారాయణరావు అధ్యక్షతన ప్రారంభమయ్యాయి. ముఖ్య అతిథిగావున్న మాజీమంత్రి శ్రీ మండలి కృష్ణారావు ప్రసంగిస్తూ, బాలల కార్యక్రమాలు నిర్వహించే స్వచ్ఛంద సంస్థలకు ప్రభుత్వం సహాయం చేయాలని సూచించారు. ఉత్సవాలు ప్రారంభించిన సాంకేతిక విద్యాశాఖామంత్రి శ్రీ హయగ్రీవాచార్యులు ఇటువంటి సాంస్కృతిక కార్యక్రమాలవల్ల పిల్లలకు విశేషంగా జ్ఞానం కలుగుతుందని అన్నారు.

## ఉ వ శ్రు తి :

ఏం కవిగారూ, పదేళ్లక్రితం మీ కావ్యాన్ని ఎవరో ధర్మారావుగారికి అంకిత మిస్తామని బహిరంగసభలో ప్రకటించారే, ఇప్పుడు ఎవరో రాజా గారి కిచ్చారే? అని ఒక అమాయకుడడిగాడు ఒక సుప్రసిద్ధ కవిని. ఆయన చచ్చాడు. వచ్చి అడుగడుగా అన్నారు కవి.

— తిరుమల రామచంద్ర



# దగ్గు గప్‌చిప్

## వచ్చేసింది
### నమ్మకమైన మందు
### కొత్త ప్యాక్‌లో

Alembic
Glycodin
ग्लायकोडिन
टर्प वसाका
TERP-VASAKA
COUGH SYRUP
खांसी की दवा

Dosage
Adults: 5 ml
(one teaspoonful)
three or four times a day.
Children
1 to 3 years as advised by the physician
4 to 6 years 1.25 ml (1/4 teaspoonful)
7 to 12 years 2.5 ml (1/2 teaspoonful)
three or four times a day.

Caution:
It is dangerous to exceed the stated dosage.

170 ml.

Indications
Coughs due to chronic bronchitis, influenza, pharyngitis, tonsillitis, throat, respiratory, exciting cough

ALEMBIC CHEMICAL WORKS CO. LTD.
MADE IN INDIA

గ్లైకోడిన్ అలాంటి, యిలాంటి మామూలు దగ్గు మందుకాదు. భారత దేశంలో దగ్గు చికిత్సకోసం వాడే మందులలో దీనిది ప్రథమ స్థానం.

**గ్లైకోడిన్ అన్ని రకాలైన దగ్గులనుంచి శమనాన్నిస్తుంది.**

- మెదడులో, దగ్గాలని అనిపించే కోరికను కలగనివ్వదు.
- ఛాతీలో, పట్టుకునేలాంటి అసౌకర్యాన్ని దూరంచేసి విశ్రాంతినిస్తుంది.
- గొంతులో, గరగరలాడటంనుంచి ఉపశమనం యిస్తుంది.
- ఊపిరితిత్తుల్లోని, కఫాన్ని బయటకు తెచ్చేస్తుంది.

**బాధపెట్టే, అసౌకర్యపరిచే అన్ని రకాల దగ్గులనుంచి శమనానికి గ్లైకోడిన్‌ని విశ్వసించండి**




అలెంబిక్—డాక్టర్లకు వీరి మందులపై విశ్వాసం ఉంది.

## గ్లైకోడిన్ దగ్గుల్ని తగ్గించడంలో భారతదేశంలో ముందడుగు.

everest/78/ACW/236-tl




సీరియల్









*(గత సంచిక తరువాయి)*

ఒక అరగంట సేపు పత్రిక తిరగేస్తూ గడిపేటప్పటికి ఎవరో తలుపుముందు నిలబడి 'సార్!' అన్నాడు.

తల ఎత్తి 'ఏంకావాలి?' అన్నాడు.

'మీ దగ్గర కంపౌండర్ ఎవరూ లేరని తెలిసింది, నాకు కంపౌండింగ్ వస్తుంది సార్' అన్నాడు.

అతనికి పద్దెనిమిదేళ్ళు కూడా లేవు. స్టూడెంటులా ఉన్నాడు

'ఏం చదువుతున్నావ్?' అన్నాడు తను.

'మెట్రిక్ పాస్ అయ్యేనండీ! ప్రైవు షార్టుహేండ్ నేర్చుకుంటున్నాను, ఇంటి పరిస్థితి బాగోలేదని...'

'యీ కాలంలో అందరి యింటి పరిస్థితి అలానే ఉంది' అందాం అనుకుని, 'నేను క్రొత్తగా పెట్టుకున్నాను క్లినిక్. ఇప్పుడు అవసరంలేదు.' 'అయితే వచ్చే నెల్లో కన్పిస్తాను' అని 'సార్! యీ మధ్యలో మీకు కంపౌండరు అవసరం అయితే యీ యడ్రస్‌కు ఒక ఉత్తరం రాయండి' అంటూ స్వంత చిరునామా గల కార్డు తీసి యిచ్చేడు. తను దాన్ని అందుకుని 'సరే' అన్నాడు. వాడు ఒక నమస్కారం కొట్టి వెళ్ళిపోయేడు.

తిరిగి పత్రిక తీసి తిరగేసేడు. ఆ తర్వాత ఎవరూ రాలేదు. పన్నెండు అయిపోయింది. మరో పూట ముగిసింది— అని తలుపులు మూసేసి టేబిలు మీద కాళ్ళు పెట్టుకుని హాయిగా కూర్చున్నాడు.

తనకి అనిపిస్తూంది యీ నిరీక్షణ ఎన్నాళ్ళో? ప్రతిరోజూ ఉదయాలు ఎవరేనా వస్తారా? రారా? అన్న ఆరాటంతో మొదలవుతుంది. రాలేదన్న బెంగతో ముగుస్తుంది [illegible]గానే తిరిగి మరోవారు. కనీసం సాయంత్రం అయినా రావొచ్చుని, సాయంత్రం రాకపోతే రేపని యీ నిరీక్షణ ప్రతి ప్రాక్టీషనరుకీ తప్పదేమో! అందరూ యిలానే మొదలు పెట్టి ఉంటారు. ఈ కాలంలో సాధారణంగా నూటికి తొంభై మంది ఉద్యోగాలకే వెళ్ళిపోతూంటారు. కాని అలా జరగటంలేదు నూటికి తొంభై శాతం స్వంత ప్రాక్టీసే పెట్టుకుంటున్నారు దీనికి కారణం సమృద్ధిగా ఉద్యోగాలు లేకపోవడమే! తల్లిదండ్రులు ఎన్నో ఆశలతో ఏదో వైభవాన్ని ఊహించుకుని మెడిసన్‌లో చేరుస్తారు తమ కుర్రాళ్ళని. వాళ్ళమీద వేలకువేలు డబ్బూ, టైమూ ఖర్చవుతాయి మెడికల్ కాలేజీలో ప్రతి పరీక్షకూ ఒక్కోసారి అయినా తప్పడం ఖాయం. అంటే పూర్తి కోర్సులో అధమం ఒక సంవత్సరం నించి రెండు దాకా ఎవరి శక్త్యనుసారం వాళ్ళు పోగొట్టుకుంటారు. కోర్సు కాగానే హౌస్ సర్జరీ ఒక సంవత్సరం. ఇవన్నీ అయ్యేటప్పటికి ఏ యిరవై ఏడో ఏళ్ళు నిండుతాయి. కొందరికి ముప్పయి, ముప్పై మూడూ కూడా నిండిపోతూంటాయి. నల్లగా నిగనిగలాడే వెంట్రుకలతో కాలు పెట్టినవాళ్ళు తెల్లని వెంట్రుకలతో యిద్దరో ముగ్గురో పిల్లలతో సంసారం చేస్తూ— [illegible] యీ కాలేజీనించి అవతల పడ్తూ ఆని స్వాతి చినుకులా ఎదురు చూస్తుంటారు పాస్ గురించి ఇన్ని కష్టనిష్ఠూరాలకు ఓర్చి బయటకు వస్తారా! వాళ్ళకు ఏళ్ళ తరబడి ఉద్యోగాలుండవు— రెండేళ్ళ క్రిందట పాసు అయినవాళ్ళకు యిప్పుడు ఉద్యోగాలు దొరుకుతున్నాయి. తను పేరు డి. ఎమ్. యస్. లో హౌస్ సర్జరీ పూర్తి కాగానే రిజిష్టర్ చేయించేడు. తనకు ఉద్యోగం వచ్చేటప్పటికి రెండేళ్ళ పైనే పట్టొచ్చు

హౌస్ సర్జనుగా ఉన్నన్ని రోజులూ రెండొందల [illegible] అయినా వొచ్చేది. యిప్పుడు అదీ లేదు. ఇరవై ఎనిమిదోఏట తన పాకెట్ మనీ గురించి రిటైర్డైన తండ్రిని అడగాలంటే! — తనకే కాదు తన భార్యకు కూడా అంటే— చాలా

**జరిగినకథ :** కొత్తగా డిగ్రీ పుచ్చుకున్న డాక్టర్ సుదర్శనం డిస్పెన్సరీ పెట్టాడు. కాలనీలో తమ కుటుంబానికి ఇరుగు పొరుగుగా వున్న శివయ్య, వెంకట్రామయ్యాల తగాదాను పరిష్కారం సూచిస్తాడు. ఎంతోమంది డాక్టర్లకు చూపించుకొని, కొన్ని వేల రూపాయలు డబ్బు ఖర్చు పెట్టినా తగ్గని విరేచనం జబ్బుకు డాక్టర్ మద్యపానం తగ్గే మార్గం చెబుతాడు. ఫీజు క్రింద విరేచనం ఇచ్చిన అయిదు రూపాయలను తీసుకొని 'తన మొదటి సంపాదన' అని ఆనందిస్తాడు సుదర్శనం.

బాధనిపిస్తుంది. తన పెళ్ళాయి నాలుగేళ్ళయినా విమలకు వొక చీరకొని ఇవ్వాయలేక పోయేడు. తనతో స్కూళ్ళలో చదువుకున్న వాళ్ళు, యీ కోర్సుకి రాకుండా వేరే కోర్సులకి వెళ్ళినవాళ్ళు డబ్బుకి ఏ చికాకు పడకుండా హాయిగ వున్నారు. ఎప్పుడేనా రోడ్డుమీద కనపడితే హోటలుకి లాక్కెళ్ళి తినిపించే వారు. తమ బిల్లు అందుకోబోతే నీవు యింకా స్టూడెంటువి, నీవియ్యకూడదు అనేవాళ్ళు—తనకు చాలా చిన్నతనం అనిపించేది. తనతో చదువుకున్నవాడు తనతో 'నీవియ్యకూడదు అని అంటే.'

అందుకే తమ అసలు ఎవరు హోటలుకి పిలిచినా వెళ్ళేవాడు కాదు.

కాలేజీలో ఉన్నన్నిరోజులూ ఎప్పుడు చదువు పూర్తవుతుందా ఎప్పుడు డిగ్రీ తీసుకుంటానా ! అన్న బెంగ డిగ్రీ తీసుకోగానే ఎంత తొందరగా డబ్బు సంపాదిస్తానా అన్న యింకో బెంగ. యీ బెంగలతోనే మిడిల్ ఏజ్‌లో కాలుపెట్టే వయస్సు వచ్చేస్తుంది ప్రతీ డాక్టరుకి.

యింత దుఃఖ భారమయిన యీ కోర్సు గురించి మెడికల్ కాలేజీకి పంపించే కుర్రవాళ్ళ తల్లితండ్రులు దీన్ని హరివిల్లులా ఎందుకు ఊహించుకుంటారో అర్థం కాలేదు.

ఆలోచనలకి అంతరాయం కలిగిస్తూ తలుపుమీద టకటక అంటూ శబ్దం.

తలుపు మూసి ఉంటే ఎవరబ్బా బాదుతున్నారని వొచ్చి తలుపు తీసేడు. ఎదురుగుండా విమల.

తనకు చాలా సంతోషం అనిపించింది. ప్రొద్దుటినించీ మాట్లాడు కొనేందుకు మనిషి లేక తన ఆలోచనలతో తనే విసిగి పోయేడు. యిక తనతో తాను మాట్లాడుకోలేదు అని అనుకోగానే ముఖం బారెలా ఊరింది.

'రా' అన్నాడు రెక్కపట్టిస్తూ.

విమల లోపలికి వచ్చింది.

ప్రక్క దుకాణాల్లోంచి తలలను తన క్లినిక్ వైపే చూస్తున్న వాళ్ళ చూపులు కూడా లోపలికి వచ్చేయి విమలతో.

ఆ చూపుల్ని బయటికి తోస్తూ తలుపేసి 'విమ్మూ ! బోరు అయిపోతూండే సమయానికి సరిగ్గా వొచ్చేవు' అంటూ ఆమెకు చుట్టుకుపోయేడు.

తన చేతుల్ని తీయకుండానే 'ఏంటో యీరోజు చాలా సంతోషంగా ఉన్నారు' అంది.

"లేదు యిద్దరం కలిసే తిందాం" అన్నాడు.

'సరే ! కాఫీ హోటల్లో తాగింతర్వాత గాజులు కొనుక్కుందాం !' అంది.

'సరే' అని యిద్దరూ హస్యోక్తులతో మెల్లగా టిఫిన్ చేసి వొక అరగంట తర్వాత బయటికి బయలుదేరేరు.

చాలా సంతోషంగా ఖర్చయిపోయింది నాలుగు గంటలకా. జేబులో బస్సు ఛార్జీకి తగినన్ని డబ్బులు ఉంచుకుని మిగిలిన డబ్బంతా ఖర్చు చేసేసేడు. విమల ఎర్ర గాజులు రూపాయిని కొనుక్కుంది. ఆమె చేతులకు అవి ఎంతో బాగా వొచ్చేయి. గాజులు తర్వాత మల్లెపూలు కొనమంది. వాటి తర్వాత చాక్లెట్లు. తర్వాత టిక్కెట్ల డబ్బు వదిలించుకుని మనసులో సంతోషాన్ని నింపుకుని నాలుగు గంటలకల్లా తిరిగి వచ్చేరు క్లినిక్కుకి.




కొత్త క్లినిక్‌లో మొదటి ఆర్జన అయిదు రూపాయలు, చెప్పు ఏంకావాలో ? అన్నాడు.

'హోటలుకి వెళ్ళి కాఫీ త్రాగుదాం' అంది.

'వొట్టి కాఫీయేనా ?'

"టిఫిన్ యింటినించి తెచ్చుకున్నారుగా తినలేదేంటి ?"

డిస్పెన్సరీలో కూర్చున్న తర్వాత విమల మెడికల్ పాంప్లెట్సు ప్రత్యేకంగా తీసి చూడండి! అంటూ తనకు చూపించింది. అది అందమైన పక్షి ఫొటో.

'ఎలావుంది ?' అంది.

బాగుందన్నాడు.

'దీన్ని కత్తిరించి ఆ గోడకు అంటిస్తే ?'

'బాగా వేడుంటుంది.'




## ప్రాక్టీసు పెట్టిచూడు

'అయితే యిక ఆలస్యం దేనికి? కత్తిరించండి' అంది.

'బ్లేడు లేదే' అన్నాడు.

'కత్తెర లేదేంటి?' అంది ఆమె.

'ఉందికాని అది కాయితాలు కత్తిరించేది కాదు. సర్జికల్ సిజరు.'

'ఫర్వాలేదులెండి, చర్మంకంటే మెత్తనయిన కాయితాన్ని కత్తిరిస్తే మీ కత్తెరేం చెడిపోదు' అంటూ ఎంత వొద్దన్నా విన కుండా కత్తెర వెతకసాగింది.

'విమలా! దీన్ని యింటికి తీసికెళ్ళి కత్తిరిద్దాం. అంత తొందరేముంది?' అన్నాడు.

'ఎప్పుడు టైము పాసుకావడానికి నేను యీ ఆలోచన చేస్తే యింటికెళ్ళిం తర్వాత అంటారే! బలేవారేనే!' అంటూ కత్తెర వెతికి తీసి బొమ్మలోని భాగం పోకుండా అతి నాజూగ్గా కత్తిరించసాగింది. ఆమె తీసుకునే జాగ్రత్తకి, నల్లభైనిగుషాల కంటే ఎక్కువే అయింది. బొమ్మని మిగతా భాగం నించి వేరుచేసి 'చూడండి' అంది.

'చాలా బాగా కత్తిరించావే! బొమ్మ ఎక్కడా చెదరకుండా' అన్నాడు. 'చుట్టు ప్రక్కల ఉండే అక్షరాలు తీసేసి దీన్ని వేరు చేస్తే — అప్పటికంటే మరీ బాగాలేదూ' అని 'యికనించి మీ మందుల కాయితాలు వస్తే వాటితో మంచి బొమ్మలు ఉన్నవి తీసి యిలా కత్తిరించి యీయండి నాకు.'

'మంచిపనే పెట్టేవే!'

'ఏంచేస్తాంచెప్పండి? ఖాళీగా కూర్చుంటే పిచ్చి ఆలోచనలు మనస్సుని దొలిచేస్తాయి' అని 'ఎక్కడేనా మేకుంటే చూడండి దీన్ని తగిలిద్దాం' అంది.

'ఈ గోడల్లో మేకులు దిగవే!'

'అయితే కొంచెం ప్లాస్టరుతో దీన్ని అతికేద్దాం' అని స్టిక్కింగ్ ప్లాస్టరు కొంచెం కోసి దాంతో గోడకు బొమ్మను అంటించి 'యీ బొమ్మ గోడకు వుంటే ఎలాఉంది?' అంది.

తను జవాబు చెప్పేలోపలే వొకతను మెట్లు ఎక్కి లోనికి వచ్చి కుర్చీలోకూర్చుని 'డాక్టరూ జ్వరం వొస్తూంది' అన్నాడు.

'ఎన్నాళ్ళనించి?' అన్నాడు తను.

'రెండు మూడు రోజులనించీ.'

'ఏమయినా మందులు వాడేరా?'

'ఆస్ప్రో, అనాసిన్ బిళ్ళలు రెండు వేసుకున్నాను, తగ్గలేదు. రెండు పెన్సిలిన్ బిళ్ళలు కూడా కొనుక్కుని వేసుకున్నాను. ఉహూ! డాక్టరు దగ్గరికివెళ్ళి డబ్బు చెల్లించుకుంటేనేగాని తగ్గనంది. ఆ డాక్టరు దగ్గరకు వెళ్దాం అనుకున్నాను. కాని అతని దగ్గరికి వెళితే ఇంజక్షనూ మాత్రలకి అయిదు తీసుకొని, రక్తం, మూత్రం పరీక్ష అంటూ యింకో అయిదు తెమ్మంటాడు. పది రూపాయలు, పిల్లలుగల వాణ్ని ఎక్కడ పెట్టుకోగలను? అందుకే మీ దగ్గరికి వొచ్చేను.'

తను పరీక్షచేసి మాత్రలు కట్టి 'మూడు పూటలా వేసుకోండి' అన్నాడు.

అతను లేస్తూ 'డాక్టరూ ఫీజెంత?'

'మూడు రూపాయలు' అన్నాడు తను.

'బిళ్ళలకి మూడు రూపాయలా?' అన్నాడు అతను.

'అవి గొట్టం బిళ్ళలండీ! చాలా ఖరీదు'

'అలాగా!' అని 'నేను రూపాయ కంటే ఎక్కువ కాదనుకుని రూపాయే తెచ్చేను. యీ ప్రక్కవీధిలోనే మా యిల్లు. నేను మిగతా రెండు రూపాయలూ తెచ్చి మందు పట్టుకెళ్తాను' అంటూ వెళబోయేడు.

తను 'ఎందుకులెండి? రేపు ఎలాగూ మీరు మందుకి రావాలిగ! అప్పుడు తీసుకు రండి' అని మాత్రలు అతని చేతికి యిచ్చేడు.

'సరే' అని లేచి వొక నమస్కారం పడేసి వెళిపోయేడు.

అతను మెట్లు దిగుతూంటే నరహరి మెట్లు ఎక్కి లోనికి వస్తూ 'డాక్టర్ యీ వొచ్చినవాడు డబ్బిచ్చేడా?' అంటూ అనుమానంగా అడిగేడు.

'ఎందుకేంటి అలా అడుగుతున్నారు?'

"ఏంలేదు వీడో టోపీదాసు. ప్రతీ డాక్టరు దగ్గరా వీడి ఖాతా ఉంటుంది. అది వొందదాకా కాగానే వీడుమరో డాక్టర్ని చూసుకుంటాడు. మొదటిరోజు కదా డబ్బిచ్చేడా" అన్నాడు.

"రూపాయి యిచ్చేడు, రెండు బాకీ పెట్టేడు."

"రేపొస్తే అసలు అరువు యివ్వను అని చెప్పేయ్...ఇతనికి కాదు ఎవరికీ అరువు

అంటూ యివ్వకు... వొకసారి ఆ పద్ధతి మొదలు పెట్టేవా ఊరు ఊరంతా నీ దగ్గరికే పరిగెత్తుకుంటూ వొస్తారు— అరువు మీద యిస్తావని. డబ్బు యివ్వవలసి వొచ్చే సమయానికి ముఖం కనిపించరు" అని 'డాక్టర్! కడుపులో కాస్త మంటగా ఉంది. కొంచెం కార్మినేటివ్ మిక్చర్ ఉంటే యివ్వు!' అన్నాడు.

తను వొక మాత్ర తీసి యిస్తూ 'యిది చప్పరించండి, మిక్చర్ కంటే బాగా పని చేస్తుంది' అన్నాడు.

"నరహరి నోట్లో వేసుకుంటూ డాక్టర్ యికనేను రేపొస్తాను. మా యింటి ఎదురుగుండా వాడ్ని రేపు తెచ్చేందుకు యీ రోజు వించే పునాదులు వేస్తున్నాను" అంటూ బయట పడ్డాడు.

నరహరి వెళ్ళిన అరగంట దాకా ఎవరూ రాలేదు. ఆ సమయంలో విమల తనతో 'రేపటినించీ పేక ముక్కలు తెచ్చుకుందాం. సుబ్భరంగా రమ్మీ ఆడుకోవచ్చు!' అంది.

"ఈ వొచ్చే వొకటీ రెండూ కూడా నా జేబులో ఉండనీయ దలచుకోలేదా?"

"పోనేండి. అప్పుమీద ఆడుదాం. వొక వేళ మీరు వోడిపోతే మీ ప్రాక్టీసు యింప్రూవ్ ఆయింతర్వాత యివ్వండి. మీరే గెలిస్తే నా భర్త డబ్బు సంపాయించేక యిస్తాను సరేనా?"

'బావుంది! యిది సామెతలా ఉంది. నా తప్పంటే నేను వెధవ ముండనవుతాను, నీ తప్పయితే నా భర్త చస్తాడు అందిట? నేను గెలిచినా వోడినా నాకే క్షవరం అన్న మాట?'

'తెలివిని తరువాత పొగుడుదురుగాని కాని ముందర పేక ముక్కలు తెచ్చుకుందామా వొద్దా?'

ఇంతలో బనీనూ- మోకాళ్ళమీద దాకా ఉన్న పంచెతో పల్లెటూరి వాడులా ఉన్నాడు- డిస్పెన్సరీలో కాలు పెట్టేడు.

తను వాడి గాధ విని పరీక్ష చేసి మందు యివ్వాయబోతూంటే, 'మందు రేపు తీసుకుంటాను. ఈ రోజు పరీక్ష చేయించుకు పోదామని వచ్చేను!' అన్నాడు.

వాడ్ని ఏమనాలో తెలియలేదు తనకు.

తను వీళ్ళందరికీ క్రొత్త. వీళ్ళతో మంచిగా ఉంటే యివాళ కాకపోయినా రేపయినా వస్తారు. అందుకే 'సరే రేపురా!'




అన్నాడు.

వాడు నమస్కారం పారేసి వెళ్ళిపోయేడు.

విమల నవ్వుతూ 'ఏంటండి? యిది. ఇంతకూ వాడు ఎందుకొచ్చేడంటారు?'

'ఎందుకేంటి? నన్ను పరీక్ష చేద్దామని వచ్చేడు. పరీక్ష చేసేడు, రిజల్టు రేపు యిస్తాడు.'

'అంటే?' అంది విమల.

'వాడు తిరిగి వస్తే నేను పాసయినట్టు, లేకపోతే ఫెయిలయినట్టు!'

అట్లా ఏనిమిదయింది. క్లినిక్ కట్టేసి పిల్లలికి అరటి పళ్ళు కొని బయలుదేరేరు యింటికి!

* * *

పండ్లను చూస్తూనే రాధ 'అన్నయ్య డబ్బు సంపాదించి పళ్ళు కొనుక్కొచ్చేసేడు. ఇవాళ అన్నం తినను, పండ్లే తింటాను' అంది.

తన ఆఖరి తమ్ముడు 'అన్నయ్యా! రేపు మిఠాయి తీసుకురావా?' అన్నాడు.

పెద్ద తమ్ముడ్ని 'మరి నీకేం కావాలిరా?' అన్నాడు.

'నాకా!'—అంటూ వొక నిమిషం ఆలోచించి. 'నువ్వు తీసుకురావులే!' అన్నాడు.

'చెప్పు తెస్తాను' అన్నాడు.

'నాకు కేన్వాస్ షూస్ కావాలి.'

'వాడికి కాన్వాస్ షూస్! నాకు వొట్టి అరటి పండ్లా?' అంటూ బుంగమూతి పెట్టుకుంది రాధ.

'చెప్పు నీకేం కావాలో?' అన్నాడు.

'నాకా! నాకు వొక మంచి లంగా కొనాలి, కొంటావా?'

'నువ్వు అడిగితే కొనక తప్పుతుందా.'

విమల నవ్వుతూ చూస్తూంది— అతన్ని, యింట్లో పిల్లల్ని.

ఈ యింటికి ఏదైనా వొక వస్తువు తెస్తే పిల్లలు ఎవరికి కావలసినవి వాళ్ళు ఏకరువు పెడ్తారు. వాళ్ళ అగడానికి వొక అంతు అంటూ ఉండదు. అదో సంతోషం వాళ్ళకి. తను వాళ్ళ ఆనందాన్ని ఎందుకు పాడుచేయాలని అప్పటికీ 'ఊ' అంటాడు. వాళ్ళు తన చేత ప్రామిస్ చేయించుకొనే టప్పటికి తల్లీ, విమలా, వొడ్డన పూర్తి చేసారు.

భోజనానికి కూర్చున్న తర్వాత తండ్రి 'వొరేయ్! అందరికీ తెలిసిన యీ లొకాలిటీలో కూడా వొక చిన్న బ్రాంచి లాంటిది నువ్వు పెడితే?' అన్నాడు.

'బ్రాంచి పెట్టాలంటే దానికి ఊరంత అట్టహాసం కావాలి. ఇప్పుడు అందరికీ తెలుసు నేను డాక్టర్ని అని. మందు కావాలి అనుకున్న వాళ్ళు ఎలాగూ యింటికే వొస్తున్నారుగా. యింక వేరే క్లినిక్ అంటూ ఎందుకు?'

## ప్రాక్టీసు పెట్టిచూడు

'అదికాదురా! నువ్వు ఒక గంట పొద్దున్నా సాయంత్రం ప్రత్యేకంగా కూర్చుంటే ?'

'కూర్చోమన్నానా! కాని వందిళ్ళు ఉన్న కాలనీలో యిప్పుడు వొచ్చే వొకరిద్దరికంటే ఎక్కువరారు.'

'ఆలోచించు. యీ కాలనీ వాళ్ళే అన్నారు మన సుదర్శనం మన కాలనీ విడిచి ఎక్కడో ప్రాక్టీసు పెట్టడం ఏంటని ?'

'సరే నాన్నా.'

పడుకోబోయే ముందు విమల 'నేను పొద్దున్నపూట రానండి- ఇంట్లో పనంతా తొమ్మిది లోపల పూర్తిచేసి రావాలంటే కుదరటంలేదు. రోజూ నేను మధ్యాహ్నం మీ క్లినిక్ మూసేసే సమయానికి మీకు టిఫిన్ తీసుకుని వస్తాను' అంది.

'నువ్వు వచ్చేది వుంటే టిఫిన్ తేవడం ఎందుకు? అన్నమే తీసుకురా! నేను పొద్దున్నే కాఫీ త్రాగి వెళ్తాను' అన్నాడు.

* * *

మర్నాడు డిస్పెన్సరీ తెరవగానే- వొక వ్యాపారిలా వున్నాడు. అతను ఇంజక్షను బజారునించి తెచ్చుకుని యింజక్షను చేయమన్నాడు తను యింజక్షను యిచ్చి 'ఒక్క రూపాయి ఫీజు' అన్నా. అతను 'డాక్టర్! యింకా పది యింజక్షన్లు చేయించుకొమ్మని గవర్నమెంటు ఆసుపత్రిలో రాసేరు. అన్నిటి ఫీజు ఆఖరి వొక్కసారిగా తీసుకోండి' అంటూ వొక నమస్కారం పారేసి వెళ్ళిపోయేడు. తనకు గట్టిగా యివ్వండి అని అడిగేందుకు నోరు తిరగలేదు.

తొమ్మిదిన్నరకు నరసింహంగారు అలా బయటికి వెళ్ళగానే లలిత వొచ్చి 'డాక్టరుగారూ నొప్పి కొంచెం కూడా తగ్గలేదు. రాత్రినించి ఎక్కువయిందండీ! మీరుసరిగ్గా చూడటం లేదు' అంటూ కోపంగా చూసింది.

'సరే మళ్ళీ పరీక్ష చేస్తాను' అంటూ లేచి ఆమె దగ్గిరికి రాబోతూంటే, 'మీకు వెర్రిలేదండీ? యిలా రోడ్డుకు ఎదురుగా పరీక్ష చేయొద్దండీ? అని' అంటూ ఆమె కర్టెనులోనికి వెళ్ళింది. తను ఆమె వెనుక వెళ్ళేడు.

(46వ పేజీ చూడండి)

# నాన్నారి కారు నేనే రిపేర్ చేసేశా!



## టింకూ లాంటి బాబు మీకూ వుంటే రీగల్ కావలసిందేమరి! ఇండియాలో అత్యధిక శక్తి గల డిటర్జెంట్ బట్టల సబ్బు.

టింకూ లాంటి పిల్లలు ఉంటే బట్టలు ఉతికే పని అధికం. అందుకు 'రీగల్' మాత్రమే సరయిన డిటర్జెంట్ సబ్బు. 'రీగల్'కుగల అధిక తెల్లదనాన్నిచ్చే శక్తి ఎంతటి మురికినైనా తొలగించి, మీ బట్టలను తళతళలాడే తెలుపుతోను, వెలుగుతోను మెరిసేలా చేస్తుంది. లోనికి చొచ్చుకొనిపోయి మురికిని తరిమివేయగల—శక్తివంతమైన—నురుగునిచ్చేది 'రీగల్.' ఇతర డిటర్జెంట్ సబ్బులన్నిటికన్న ఎక్కువ ఉతుకులు ఇచ్చే 'రీగల్.' మీకు ఎంతో పొదుపు చేస్తుంది.

'రీగల్'ను మీ కుటుంబపు డిటర్జెంట్ సబ్బుగా చేసుకోండి.




Rediffusion D/768e/TL/R

సాయంత్రం అరయింది. ఆఫీసు నుండి నెమ్మదిగా రూమ్ వేపు నడుస్తున్నాను విశాఖపట్నం వాతావరణం అలవాటయ్యేసరికి సరిగ్గా రెండునెలలు పట్టింది రోజూ పదిగంటలకి ఆఫీసుకి వెళ్లడం మళ్లీ సాయంత్రం ఏడుగంటలకి రూమ్‌కి రావడం, అలా ఏవేవో పుస్తకాలు చదవడం- పడుకోవడం తోను గడిచిపోతోంది జీవితం!

ఈ ఒంటరి జీవితం మీద విసుగు పుడ్తోంది.

"నాకు వప్పెన్నం వీప్పుడు పెడతావోయ్?" అంటూ ఆఫీసులో అప్పుడే గొడవ ప్రారంభించారు ఈ పెళ్ళయిన వాళ్ళు మహా సుఖపడిపోతున్నట్టూ, పెళ్ళి కానివాళ్ళు విందుకూ పనికిరాని వాళ్ళన్నట్టూ మాట్లాడుతుంటారందరూ బ్రతకడానికి పెళ్ళనేది ఓ క్వాలిఫికేషనా? అది లేకపోతే జీవితానికి 'పరిపూర్ణత' లేదా? లోకంలో పెళ్ళికాని వాళ్ళెంతమంది బతకడంలేదు? పెళ్లయిన వాళ్ళెంతమంది అశాంతితో జీవించడంలేదు? ఏమిటో యిలాంటివి వింత తరచిచూచినా అర్థం కావు. అంతుపట్టదు!

ఇంతలో ద్వారకా బస్‌స్టాండు వచ్చింది. ఆగి బస్ కోసం నిల్చున్నాను ఇంతలో అక్కడికెళ్ళాను. వచ్చేపోయే మనుషుల్ని వాళ్ళ తిరుళ్ళీ చూస్తుంటే సరదాగా ఉంటుంది. ఈ 'సిటీ లైఫ్' బలేగమ్మత్తుగా ఉంటుంది. అంతా బలే 'స్పీడ్'గా జరిగిపోతూ ఉంటుంది. ఆఖరికి చావులు కూడా బలే స్పీడ్‌గా వచ్చేస్తుంటాయి!

"ప్రసాద్! నువ్వు యిక్కడున్నావా?" అన్న పిలుపుతో వెనతిరిగాను.

ఎదురుగా అరుణ!

ఎంత మారిపోయింది?

పాలిస్టర్ చీర, చీరకు మాచ్ అయిన జాకెట్, దాని రంగుకి సరిపోయిన నెక్లెస్, చేతిలో హేండ్‌బేగ్, కళ్లకు 'కూల్' గ్లాసెస్- ఓహ్! అరుణేనా యీమె?

"ఏమిటలా ఆశ్చర్యంగా చూస్తున్నావ్? నేను అరుణని" అంది మళ్ళా నవ్వుతూ.

"నువ్వు ... యిక్కడ ..., యిలా ..." మాటలు తడబడుతున్నాయి నాకు.

"నన్నుచూసి నీకు మతిపోయినట్టుంది" అంది ఈసారి గట్టిగానే నవ్వుతూ. అప్పటికే చుట్టూ ఉన్న జనం మావేపు వింతగా చూస్తున్నారు.

"ఔను. నాకు తెలిసిన అరుణ యింత కాస్ట్లీగా ఎప్పుడూ లేదు. ఈ రూపంలో నిన్ను చూసిన నాకు నిజంగానే మతిపోయింది" అన్నాను.




"పద అలా నడుస్తూ మాట్లాడుకుందాం" అంది.

ఇద్దరం అలా 'ఆసీలుమెట్ట' వేపు నడక ప్రారంభించాం

"ఊఁ ఇప్పుడు చెప్పు. ఏమిటి సంగతి? ఇక్కడికెప్పుడొచ్చావ్? ఏంచేస్తున్నావ్? ఐవాంట్ డిటైల్డ్ ఇన్‌ఫర్మేషన్ అబౌట్ యూ" అన్నాను నడుస్తూనే ఆమె ముఖంలోకి చూస్తూ.

"నేను 'అలహాబాద్ బ్యాంక్'లో క్యాషియర్‌గా, పని చేస్తున్నాను. మొన్నటి వరకూ 'కాశీబుగ్గ' బ్రాంచిలో పని చేశాను. ఈ మధ్యనే యిక్కడికి ట్రాన్స్‌ఫర్ అయింది. వారం రోజులయింది విశాఖపట్నం వచ్చి. ముచ్చటగా మూడు ముక్కల్లో చెప్పాలంటే ఇదీ నాగురించి చాలా? ఇంకా ఏమయినా వివరాలు కావాలా?" అంది నాటక ఫక్కీలో.

"నువ్వేం మారలేదు. అదే చిలిపితనం, అదే ధోరణి" అన్నానేను నవ్వుతూ.

"ఇహ నీ గురించి...?" అడిగింది

"ఏముంది? మామూలే. తాలూకాఫీసులో గుమాస్తాని."

"అయితే ఇద్దరం గుమాస్తాలమయ్యామన్నమాట."

మీరు గుమాస్తాలైనా బ్యాంక్‌లో ఉద్యోగం అంటే అదోరకం 'చార్మ్.'

"ఆఁ ఏం చార్మ్ లెద్దూ, మా బాధలు మాకుంటాయి. అన్నట్టు నువ్వు డిగ్రీ తరువాత 'మెడిసిన్'కి వెళ్ళలేదా?" అంది హఠాత్తుగా 'టాపిక్' మార్చి.

"మనం అనుకొన్నవన్నీ అయిపోతే జీవితంలో 'థ్రిల్' ఉండదుగా. అందువేత ఈ ఉద్యోగానికొచ్చేసి, ఆ ఉద్దేశానికి గుడ్‌బై కొట్టేశాను" అన్నానేను ఎంత 'కంట్రోల్' చేసుకున్నా నా గొంతులో బాధ ధ్వనించింది.

"తాతయ్యగారెలా ఉన్నారు?" అడిగింది.

"చనిపోయారు. మూడు సంవత్సరాలయింది."

"అరెరె. నాకు తెలీదే. మొన్న లక్ష్మి కనిపించింది. అదే మన క్లాస్‌మేట్ ఈ విషయమే చెప్పలేదు ఎంత సరదాగా మాట్లాడేవారు తాతయ్యగారు" అంది బాధగా అరుణ.

"అందుకే నేను చదువు ఆపెయ్యవలసి వచ్చింది" అన్నాన్నేను.

అలా కబుర్లు చెప్పుకుంటూ చాలా దూరం నడిచాం

"ఇంతకీ ఎక్కడికి వెళ్లాలి నువ్వు ?" అడిగాను

"వాల్తేరు అప్ లాండ్స్ అక్కడ మా పిన్నిగారున్నారు వాళ్లింట్లోనే ఉంటున్నాను ప్రస్తుతానికి" అంది అరుణ

ఇంతలో 'సిరిపురం జంక్షన్' వచ్చింది అప్పుడే నెంబర్ వన్ బస్ అటువేపు వస్తోంది

"మరి వెళ్తాను ప్రసాద్ నువ్వు తీరిక చూసుకొని మా బ్యాంక్‌కి రా సాయంత్రమయితే అక్కడనుండి అలా బీచ్‌కి వెళ్లి సావకాశంగా మాట్లాడుకుందాం" అనేసి, బస్ ఆపి ఎక్కి వెళ్లిపోయింది అరుణ

ఓ మెరుపు మెరిసి మాయమయినట్లయింది నాకు! నిర్జీవంగా, నిరాశగా బ్రతుకుతున్న నాకు అరుణ మళ్లీ నాకిలా కలవడం కొంత 'రిలీఫ్' యిచ్చింది నేను బియ్యస్సీ చదివే రోజుల్లో అరుణతో చాలా 'క్లోజ్'గా ఉండేవాణ్ణి చిన్నప్పుడు తల్లిదండ్రులకు దూరమయినవాణ్ణి కాబట్టి తాతయ్యగారు చాల ముద్దుగా పెంచారు నన్ను డాక్టర్ని చేద్దామని కలలు కంటూండేవారు తాతయ్య నేను కూడా 'బియ్యస్సీ' అయిన వెంటనే మెడిసిన్'కి వెళ్లాలని అనుకున్నాను అరుణ రోజూ మా యింటికి వచ్చేది తాతయ్యగారంటే ఎంతో అభిమానం ఆమెకు ఆయన కూడా నేను అరుణను చేసుకుంటే బావుణ్ణన్న అభిప్రాయంతో ఉండేవారు ఆమెకూ, మాకూ దూరపు బంధుత్వం కూడా ఉంది కాని నేనుమాత్రం అరుణను భార్యగా ఊహించలేకపోయాను కారణం, అపుడు నాలో నిద్రాణమై ఉన్న అహంభావం!

ఒక డాక్టరుని పెళ్లి చేసుకోవడానికి మరో డాక్టరు మాత్రమే అర్హురాలన్న అభిప్రాయంతో ఉండేవాణ్ణి అందుకు అరుణని అలక్ష్యం చేశాను తీరా, ఓ రోజు ఆమె తన అభిప్రాయాన్ని వెల్లబుచ్చినప్పుడు నేను చెప్పిన సమాధానం నాకు బాగా గుర్తు

"స్నేహాన్ని స్వార్థం కోసం ఉపయోగించుకోవడం చాలా పొరపాటు అరుణా మనిద్దరికీ పరిచయం ఉన్నంత మాత్రాన భార్యాభర్తలు కావాలని ఉందా ఓ మామూలు స్నేహితుడిగా నన్ను చూడలేవా నన్ను అలా గౌరవించలేవా ?" సూటిగా ఆమె కళ్ళలోకి చూస్తూ అన్నాన్నేను ఆమె ఏమీ మాట్లాడలేదు చిన్నగా, సన్నగా నవ్వింది ఆ నవ్వులోని బాధ, నిరాశ మాత్రం నన్ను దహించివేశాయి ఆ క్షణంలో ఆ తరువాత వాళ్ల నాన్నగారికి ట్రాన్స్‌ఫర్ కావడంతో ఆ ఊరునుండి వెళ్లిపోయింది అరుణ అలాంటి అరుణ మళ్లీ యిప్పుడు, యిక్కడ, యిలా తారసపడడం చాలా ఆశ్చర్యంగా ఉంది నాకు!

అరెరె! మళ్లీ ఎంతో దూరం నడిచి వచ్చేశాను జగదంబా జంక్షన్ వచ్చేసింది అప్పుడు అప్‌లాండ్స్‌నుండి తిరిగివచ్చిన నంబర్ వన్ బస్ వచ్చి ఆగింది ఈ బస్‌లోనే యిందాక అరుణ ఎక్కి వెళ్లింది వెంటనే అందులోకి ఎక్కి కొత్త రోడ్ జంక్షన్‌లో దిగి, హోటల్‌కి వెళ్లి భోంచేసి రూమ్‌కొచ్చి పడుకున్నాను

ఆ మర్నాడు నేను అరుణ దగ్గరికి వెళ్లాను సాయంత్రం ఐదు గంటలకి నన్ను చూసి బయటకు వచ్చేసింది ఇద్దరం 'కొచ్చిన్ కేఫ్'లో కాఫీ తాగి బస్‌లో బీచ్ కెళ్లాం అక్కడ ఎంతోసేపు ఎన్నో విషయాలు మాట్లాడుకున్నాం ఆమె మునుపటిలా, ఎంతో ఆప్యాయంగా, సరదాగా మాట్లాడింది ఆ రోజు రాత్రంతా నాకు నిద్దరపట్టలేదు ఏదో గుండెల్లో కలకలం! ఏదో ఆశ! మనసంతా తియ్యని ఊహలతో నిండిపోయింది

అలా ఆమెతో ఎన్నో సాయంత్రాలు గడిచిపోయాయి! మునుపటి సరదాలు, నవ్వులు మళ్లీ యధాప్రకారం మా యిద్దరిలో చోటు చేసుకున్నాయి

ఇప్పుడు మేం యిద్దరం మునుపటికంటే దగ్గరయ్యాం ఓ రోజు బీచ్‌లో యిద్దరం కూర్చుని ఉన్నాం నేను అరుణ చేతిలోని గాజుని నెమ్మదిగా అటూ యిటూ తిప్పుతూ మాట్లాడుతున్నాను

"అరుణా! నీతో ఓ విషయం చెప్పాలి వింటావా ?"

"మూడు నెలలబట్టి ఎన్నో చెప్తున్నావ్ నేను వినడంలేదనా నీ ఉద్దేశ్యం ?" అంది నవ్వుతూ

"నవ్వులాటకాదు నేను చాలా సీరియస్‌గా మాట్లాడుతున్నాను ఇప్పుడు నేను చెప్పబోయేది మనిద్దరి జీవితాలకి సంబంధించినది"

"ఊఁ అయితే చెప్పు" అంది నా చేతిల్లో నలుగుతున్న ఆమె చేతిని నెమ్మదిగా లాక్కుంటూ

"నేను నిన్ను పెళ్లి చేసుకోవాలనుకుంటున్నాను, నీ కభ్యంతరం లేకపోతే నీ ఉద్దేశ్యం నాకు కావాలి" అడిగాను ఆమె కళ్ళల్లోకి సూటిగా చూస్తూ

చివాల్న నా కళ్ళలోకి చూసింది! అలా ఓ ఐదు నిముషాలు తల తిప్పలేదామె

"స్నేహాన్ని స్వార్థం కోసం వాడుకొనడం తప్పుకాదూ, ప్రసాద్ నన్ను నీ భార్యగా కాక ఓ స్నేహితురాలిగా చూడలేవా" అంది ఆఖరి వాక్యం వత్తి పలుకుతూ

ఛెళ్ళున కొరడాతో కొట్టినట్లయింది నాకు!

"అప్పుడు నేనన్న మాటలు తిరిగి నా కప్పగించావా అరుణా" అన్నాను

'ఆ ఉద్దేశ్యం నాకు లేదు ప్రసాద్

'యుమగోల' ఆధారంగా తమిళంలో తీస్తున్న చిత్రంలో నిర్మాత కృష్ణవేణి, అనూరాధాదేవి, శివాజీ గణేశన్, శ్రీప్రియ, యోగానంద్, రామస్వామి.



# ఆంధ్రసచిత్రవారపత్రిక

## రచయితలకు గమనికలు

★ ఆంధ్ర పత్రిక వారపత్రికకు కథలూ ఇతర రచనలు పంప దలచుకున్నవారు సంపాదకుడు ఆంధ్ర పత్రిక వారపత్రిక, గాంధీ నగరం, విజయవాడ–520 003 అన్న చిరునామాకి వ్రాయాలి.

★ కవరు మీద శీర్షిక పేరు పేర్కొనడం మంచిది. రచయితలు తమ పూర్తి పేరూ చిరునామా రచన చివరకూడా స్పష్టంగా వ్రాయాలి– హామీ పత్రం జత చెయ్యాలి.

★ గేయాలు తప్ప పంపబడ్డ వాటి పరిశీలనకు కూడా [illegible] నుంచి ఎనిమిది వారాల గడువు అవసరం

★ కథలుగాని, ఇతర రచనలుగాని త్రిప్పి పంపబడాలని కోరుకునే వారు– వారి స్వంత చిరునామా గల తగినన్ని తపాలా బిళ్ళ లంటించిన కవరు పెట్టడం అవసరం

★ రచనల గురించి పంపిన వెంటనే గాక ఎనిమిది వారాల తరువాత మాత్రమే వాటిపై నిర్ణయం కోసం ఎదురుచూడడం మంచిది రచనల గురించి ఉత్తర ప్రత్యుత్తరాలకి తావులేదు కాని– తప్పని పరిస్థితులలో వాటిపై వ్రాయవలసివస్తే రచయితలు– రచన పేరు– అది పంపిన తేదీ, వివరంగా వ్రాయండే. వాటి గురించి పరిశీలించడం కష్టం.

★ మా కార్యాలయానికి రచనలు తెచ్చి ఇచ్చేవారు కూడా పై నిబంధనలన్నీ పాటించాలి. వారికి కూడా స్వంత చిరునామా గల తగినన్ని తపాలా బిళ్ళ లంటించిన కవరు జత చెయ్యాలి అన్న నిబంధన వర్తిస్తుంది.

★ కార్టూన్లు పంపేవారు కూడా 8 వారాలలోగా మా మీద ఉత్తరాల దాడి చెయ్యకూడదు... ప్రతి కార్టూన్ వెనుక పూర్తి పేరు, చిరునామా వ్రాయాలి

★ ప్రత్యేక సందర్భాలుగా వేసిన కార్టూన్ల కవర్ పై ఆ విషయం వ్రాస్తే వాటి పరిశీలన త్వరితంగా జరుగుతుంది.

★ కార్టూన్ల ఎంపిక తరువాత వాటి ప్రచురణ వీలు వెంబడి జరుగుతుంది.

★ రచయితలకు కార్టూనిస్టులకు ఒక్క ఉత్తరం. ప్రశ్నావళి, డాక్టర్ సలహాల శీర్షికలో 'పద్మ' వారికి వ్రాసే తతిమ్మా అందరికీ; అవి వద్దు "ప్రతు"లు– కాల క్రమంలో వాటి పాలిటోపికాలను పంపేందుకు కాపీల టపాలో పోయే ప్రమాదం వుంటుందే తప్ప పంపకపోవడం జరుగదు. సం.

## స్వాతి చినుకు

నీ మనసు బాధపెట్టాలని నా కెప్పుడూ లేదు. కాని నువ్విలా అడుగుతావని అనుకోలేదు. కాని యింత దూరం వచ్చింది కాబట్టి చెప్తున్నాను. నేను త్వరలోనే మా బ్యాంక్ మానేజర్‌ని పెళ్లి చేసుకోబోతున్నాను. జీవితంలో అవకాశాలు చాలా అరుదుగా వస్తాయి ప్రసాద్. కాని వాటిని కొందరు అదృష్టవంతులే సద్వినియోగ పరచుకుంటారు నీలాంటివారు వాటిని వదులుకుని తరువాత విలపిస్తారు. అంతే!'' అంది ఆవేశంగా!

నిజమేనన్పించింది నాకు! అపుడు అహంభావంతో అరుణని కాలదన్నుకున్నందుకు నాకీ శిక్ష సరైనదే అన్పించింది మనసంతా ఏదో బరువుగా, దిగులుగా అయిపోయింది. మౌనంగా యిద్దరం అలా చాలాసేపు కూర్చున్నాం. టైం చూస్తే తొమ్మిదయింది.

''ఇహ లేద్దామా'' అన్నాను నేను లేస్తూ

అరుణ కూడా లేచింది. రోజూ అరుణ చేయి అందుకుని ఆమెని లేవనెత్తడం అలవాటు. కాని ఈ రోజెందుకో అలా చేయాలన్పించలేదు. ఆమె పెళ్లి గురించి చెప్పిన తరువాత 'పరాయి సొమ్ము' అనే భావం నాలో నాటుకుపోయింది!

ఇద్దరం బస్‌స్టాప్ దగ్గరికి నడిచేవెళ్లాం. ఏవో ఊహలు నన్ను చుట్టుముడుతున్నాయి. నేను ఈ మూడు నెలలుగా కన్న కలలు ఈనాటితో కరగిపోయాయి! మళ్లీ మామూలే! ఈ ఒంటరి జీవితం మళ్లీ ప్రారంభం!

''ఊఁ. మాట్లాడవేం'' అంది అరుణ.

''ఏం మాట్లాడను'' అన్నాన్నేను.

''బస్ యింకా ఎంతసేపటిలో వస్తుందో.''

''టైమయింది. వస్తూ ఉండాలి.''

ఇంతలో నెంబర్ టెన్ వచ్చింది. ఆమె బస్ ఎక్కింది.

''గుడ్ నైట్'' అంది బస్‌లోంచే.

''గుడ్‌బై'' అన్నాన్నేను చేయి ఊపుతూ.

నెమ్మదిగా నేనుకూడా కాళ్లీడ్చుకుంటూ రూమ్‌వేపు నడిచాను. ఆ తరువాత నాలుగు రోజులు అరుణని కలుసుకోలేదు. ఆమెని కలవని రోజులు ఏదో వెలితిగా అన్పించసాగాయి. ఆమె లేని నా జీవితం 'శూన్యం'

# ప్రశ్నావళి

**—కె. రామలక్ష్మి**

[illegible]

లవ్ ఎట్ ఫస్ట్ సైట్ అన్నాడొక కవి. అది అందరికి పరిమితం కాదంటాను మీరేమంటారు.

అందరికీ పరిమితం? ఏమిటి నా ముఖం అంటాను ! !

గోరింటాకు మీ నవల ఆధారంగా నిర్మితమని విన్నాము. అప్పుడు మురారిగారు మీకేం ముట్ట చెప్పారో తెలుసుకోవచ్చా ?

చూడండి ధర్మారావుగారూ, చదువుకోగానే సరికాదు. సంస్కారం కుడా కావాలి అంటారు— ఇందుకే. ఇలాంటి ప్రశ్నలు నిరక్షరాశ్యులు ఏమీ తెలియనివాళ్ళే అడగరే— మీరెలా అడుగుతున్నారు. పోనీ— ఇంత యిచ్చారంటే సంతోషిస్తారా ? ఏమీ ఇవ్వలేదంటే విచారిస్తారా ? అర్చేవారూ తీర్చేవారూ కానప్పుడు ఇలాంటివి అడగకూడదు. వయస్సు ముదిరినా ఫరవాలేదు. నేర్చుకొండి.

[illegible]

కొందరు దేవుడు లేడంటారు. ఎందుకని ?

ఏ బస్సులోనూ ఎప్పుడూ ఎదురుపడలేదో, పిలిచినప్పుడు కట్టుకున్న పెళ్ళాంలాగా టక్కున పల్కలేదో...కారణాలు ఏమని చెప్పకలం?

[illegible]

అందం, మంచి మనస్సు ఉన్న భార్యవుండి మగవాడునేరే స్త్రీలతో సంబంధం పెట్టుకుంటారు కారణం.

స్వంత భార్యలతో చౌకబారుగా ప్రవర్తించలేరుకదా. బహుశా అందుచేతనేమో మొన్నీ మధ్య నో సినిమా లో నొ హీరోగారు అద్భుతమైన ఉవాచ నొకదాన్ని పారేశారు. కట్టుకున్న పెళ్ళాం కంచం లాంటిది కడిగి దాచుకుంటాం పరాయి స్త్రీలు అరిటాకుల్లాంటి వాళ్ళు— తిని అవతల పారేస్తేగాని దాచుకుంటామా ! అని.

[illegible]

న్యాయం— అన్యాయం తీర్పిదిద్దేది ఎవరు?

మానవుల చేతలు!

[illegible]

ప్రేమ [illegible] కర్డ్రీ ద్వేషం పెంచుకునే [illegible]

అలా జరగదు ప్రేమ హెచ్చిన కర్డ్రీ ద్వేషం తరుగుతుంది.

[illegible]

మనిషికి డబ్బుకి తేడా ఏమిటి?

జీవంపార్ మనిషి సజీవి, డబ్బుకాదు!

[illegible]

నేను చివరిదాన్ని. నన్నెవరూ ప్రేమగా చూడరు. చివరికి మా అమ్మ కూడ. నాకెప్పుడూ చచ్చిపోవాలని వుంటుంది.

తప్పు కరుణా, జీవితం చాలా విలువైనది అందరూ నిన్ను సరిగా చూడడం లేదన్న ఫూహ పోవాలంటే— ఏంచెయ్యాలో తెలుసా ? ఒక్కసారి ప్రశాంతంగా కూర్చుని నువ్వు అందరినీ ఎలా చూస్తున్నావో ఆలోచించుకో. మనం ప్రేమాదరణలు ప్రదర్శించకుండా, ఎదుటివాళ్ళు ప్రదర్శించడం లేదనుకోవడం స్వార్థం కాదా? సంసార బాధ్యతలలో తనమునకలైపోయి— తననే మరిచిపోతుంది తల్లి ఆమెమీద కక్ష పూనడం అర్థంలేనిమాట 'అమ్మా నువ్వు నాకు కావాల'నిఅనిపిల్లకితల్లి దూరంకాదుకాని లోపల్లోపలే కుమిలిపోతుంది— నన్నెందుకిది యింత దూరం చేసుంది అని. అంచేత ఆలోచించు

[illegible]

నిజంచెప్తే నమ్మరు. అబద్ధం చెప్తే నమ్ముతారు ఈ లోకంలో నిజానికి విలువలేదా?

ఉంది. కాని అబద్ధానికున్నంత లేదేమో అనిపిస్తుంది.

[illegible]

మేమేకలుందాలంటారువి ప్రేమించా. కాని కొన్నికారణాల వల్ల దూరం అయ్యాము. మన సినిమాల్లో లాగా మళ్ళీ మేం కలిసేది వుందా?

ఏమో చెప్పలేం రావుగారూ, ప్రజలు ట్రాజెడీ వైపు మొగ్గు చూపితే — ఎడబాటే సుఖాంతం అయే ప్రమాదం లేకపోలేదు

[illegible]

ఎన్.టి.ఆర్. నటించిన చిత్రాలలో ఎక్కువ కేంద్రాలలో నూరురోజులు ఆడిన చిత్రమేది?తెలుగు ఫిల్ములలో ఎక్కువ డబ్బులు వసూలు చేసిన చిత్రమేది?

మొదటిది అభిమాన సంఘ లవారికీ, రెండోది— యిచ్చినవాళ్ళకీ, పుచ్చుకున్న వాళ్ళకీ, చెప్పింది — ఇన్‌కమ్‌టాక్స్ వారికే తెలుస్తుంది!

[illegible]

భార్యాభర్తల కలహాలు ఎందుకొస్తాయి?

ఒకరిభాష ఒకరికి అర్థంకాక! అర్థం చేసుకుందుకు —ఏ ఒక్కరూ ప్రయత్నించక.

[illegible]

ఆడవారిగా పుట్టి మగవారి ప్రశ్నలకు ఛాలెంజిగా సమాధానాలు ఇస్తున్నారు. మగవాడిగా పుడితే దేనిపై ఛాలెంజి చేస్తారు?

మగవారి మీదే! అయినా ఐతే గియితే— అయితం పూడి వుద్యోగంలా ఇదేం గొడవ?

[illegible]

మన ఆర్.టి.సి, ప్రయివేటు బస్సులలో స్త్రీలకు సీట్లు కేటాయిస్తారు కదా? దీని అంతర్యం ఏమి?

ఏముంది, బుద్ధి బలమే గాని భుజబలం స్వల్పంగా వుండే ఆడవారికి సౌకర్యంగా వుంటుందని

[illegible]

ఆడది సంఘంలో యిప్పటికీ స్వతంత్రించి ఏపనీ చేయలేదు అని, మరి ప్రపంచంలో ఎవరికైనా ఆడది బానిస అనే అంటాను.

స్వీయానుభవాన్ని బట్టి అంచనా వేస్తే ఇలాగే వుంటుంది చిట్టితల్లీ— కామెర్లవాడికి లోకం అంతా పచ్చగా కన్పించినట్లే ఇదీను!!

---

అన్పించింది. ఈ 'షాక్' నుండి తట్టుకోలేక పోతున్నాను. ఆఫీసులో ఏ పేపర్ తీసినా అరుణ ముఖమే కన్పించసాగింది.

''సార్. మీ కుత్తరం వచ్చింది'' అన్న పోస్ట్‌మేన్ మాటలతో ఈ ప్రపంచంలోకి వచ్చాను కవరు అందుకుని, చింపి చూస్తే అరుణ దగ్గర్నుంచి వచ్చింది ! కొట్టుకుంటున్న గుండెలతో చదవడం మొదలు పెట్టాను.

డియర్ ప్రసాద్,

అంత ఆత్రంగా, ఆవురుమంటూ చదవకు. కాస్త నెమ్మదిగా, నిదానంగా చదువు. మొన్న బీచ్‌లో నా మాటలకి యింత బెంబేలు పడిపోతే ఎలా చెప్పు? ఇంత బేలతనం ఉండకూడదు మగవాడికి !

నేనా మాటలు ఊరికే అన్నాను నేను మా మానేజర్ని ప్రేమించడం, పెళ్లి చేసుకోవడం అంతా వట్టిదే. నిన్నో ఆట పట్టించాలని అలా అన్నాను. ఆడది జీవితంలో ఒకేసారి ప్రేమిస్తుంది. నా జీవితంలో నేను ఆరాధిస్తున్నది నీ ఒక్కడినే !

నాలుగేళ్ళ క్రితం నన్ను పెళ్లి చేసుకోమని నేను అడిగినప్పుడు నన్ను కాదన్నావ్ ! ఇప్పుడు నేను నిన్ను కాదంటే యీ నాలుగు రోజుల్లోనే యింత దిగులుపడ్తున్నావ్ ! ఈ నాలుగేళ్ళుగా నేనెంత మనఃక్షోభపడి ఉంటానో నువ్వూహించావా ?

ముత్యపుచిప్పలో పడిన ప్రతీ చినుకూ ముత్యం అయిపోదు. ఆ అదృష్టం ఒక్క 'స్వాతి చినుకు'కే దక్కుతుంది! అలాగే మన జీవితంలో ప్రతి అవకాశం ఫలించదు ! దేనికయినా సమయం, సందర్భం కలిసి రావాలి.

సరే, ఈ నాలుగు రోజులూ నిన్ను బాధ పెట్టినందుకు క్షమించు. సాయంత్రం ఆరు గంటలకి రామకృష్ణా బీచ్‌లో నీకోసం ఎదురుచూస్తుంటాను. అన్నీ వివరంగా మాట్లాడుకుందాం. మరి ఉంటాను.

నీకోసం ఎదురుచూస్తూ నీ,

అరుణ.



## చిట్టెమ్మ కథ

గుమ్మాలకి పసుపురాసి బొట్లు పెడుతూంటే మారప్ప వచ్చింది "కొంచెం చల్లమజ్జిగ పోస్తావా, వదినా ?" అంటూ చతికిలబడి ఆ కబురూ ఈ కబురూ చెప్పి మజ్జిగ పట్టుకొనివెళ్తూ అంది, "వదినా, ఇంత ముచ్చటపడి అలంకరిస్తున్నావుగాని కోడలుపిల్లకు నచ్చుతుందో లేదో ? అసలే పట్నవాసంది, పైగా చదువుకున్నది."

"ఎద్దువడిగి గంటలు కడతారా ? వచ్చే పిల్లనడిగి నా యిల్లలంకరించాలా ?" మారప్ప వెళ్తూంటే గొణుక్కున్నాను చదువుకున్నదయితేనేమి, పట్నవాసందయితేనేమి – నా ఇంటికొచ్చే మనిషి నా చెప్పుచేతల్లో వడచుకోవాలి ఏదో వెంకడి విషయంలో నా మాట నెగ్గలేదుగాని నేనీ ఇంట అడుగు పెట్టిన్నాటి నుండి నా మాటకి తిరుగుందా ? అత్తగారి నుండి ఇంటి పెత్తనాన్ని ఎంత చాకచక్యంగా చేజిక్కించుకున్నాను ?

పదమూడో ఏట కాపరాని కొచ్చిన నాకీ యింటి పరిస్థితులేమి నచ్చలేదు. అత్తగారి నోటికి అదుపూ ఆజ్ఞ వుండేదికాదు. పెళ్ళాం పోరు పడలేక మామగారు కాలం చేసారేమో ఆవిడకిలోడు ఆడబడుచు – మారప్ప నత్తవారు పంపించేసారు. ఆయన్ని చూడ్డానికే భయమేసేది. వాకన్నా బారడెత్తు, మెలితిరిగిన మీసాలు ... భోజనాలయ్యాక తాంబూల మివ్వడానికి తప్పనిసరిగా దగ్గిర కెళ్ళేదాన్ని. కిళ్ళీ అందుకొని బుగ్గమీద చిటికెస్తే కందిపోయిందేమోనని తడుముకునేసరికి వీధిలో కెళ్ళిపోయేవారు.

ఒకరోజు పాలకుండ తోముతూంటే చెయ్యి జారింది.

"ముదనష్టపుదానా, రోజుకొకటి విరుస్తే ఎవరు కొంటారే ? నీ అబ్బిస్తాడా ? నీ అన్న కొంటాడా?" అత్తగారు తిట్లు ప్రారంభించింది.

"అన్నే కొంటాడు బోడికుండకేనా ఈ శాపనార్థాలు ?" అన్నయ్య గొంతుక వినిపించేసరికి తలెత్తాను "రోజూ యిలాగే తిడుతుందా, చిట్టీ ?"

నేను భయపడుతూ తలూపేను

"ఆ చేతులు కడుక్కొని రా నీతో మాట్లాడాలి."

నేను అన్నయ్య వెనకాతల వెళ్తూంటే అరుగు మీద కొంగు సరిచేసుకుంటూ సణగసాగింది, "పనీపాటులేకుండా పొద్దున్నే వచ్చేస్తాడు చెల్లెల్ని వెనకేసుకురావడానికి"

మాది పొరుగూరే అన్నయ్య వారానికి, పదిరోజులకి ఊర్లో పనున్నప్పుడు చూసి పోతూంటాడు. కాని ఎప్పుడూ యివాళ్టిలాగ ముద్దుల చెల్లెలికి తిట్లు పడుతూంటే రాలేదు.

"చిట్టీ, నువ్విలాగ దద్దమ్మలాగ కూర్చుంటే ఎలాగా ? ఇది నీ యిల్లు ధైర్యంగా జవాబు చెప్పాలి. లేకపోతే మీ ఆయనతో చెప్పి..."

"ఆయనతోనా ?" నా కళ్ళలో భయం తొంగిచూసింది.

"ఆయన కూడా తిడతాడా లేక కొడతాడా, అంత భయపడ్డానికి ?"

"నాతో యిప్పటివరకు ఆయన మాట్లాడలేదు"

అన్నయ్య కొంచెంసేపు ఆలోచించి అడిగేడు, "చిట్టీ, రాత్రి భోజనం అయ్యాక మీ ఆయనేం జేస్తాడు ?"

"వీధిలో కెళ్తారు," అన్నాను చిటికెవేస్తే కందిపోయే బుగ్గ నిమురుకుంటూ

"ఎప్పుడొస్తాడు ?"

"ఏమో, నేను లేచేసరికి గదిలో పడుకొనుంటారు"

"నువ్వెక్కడ పడుకుంటావు ?"

"నేను, మారప్ప..."

"చిట్టీ, ఇవాళ నేను చెప్పినట్టు చెయ్యి. మీఆయన యివాళ రాత్రి వెళ్తూంటే వెంటబడు. నిన్ను తీసికెళ్ళకపోతే వెళ్ళనివ్వద్దు. రేప్పొద్దున్న నేను మళ్ళీ వచ్చి ఏం జరిగిందో చూస్తాను."

అన్నయ్యలాగెందుకు చెయ్యమన్నాడో అప్పుడర్థంకాలేదు గాని చెప్పేడుకదా అని రాత్రి తాంబూలమిచ్చేక మెల్లగా అన్నాను, "మీతో నన్నుకూడ తీసికెళ్ళండి."

"నాతోనా ? నీకేమైనా మతిపోయిందా ?" ఆయన గొంతుక హెచ్చించేసరికి గడగడలాడేను.

అన్నయ్య జ్ఞాపకం రాగానే ధైర్యం తెచ్చుకుని పిడచగట్టుకుపోయిన గొంతుకను సరిచేసుకొని అన్నాను, "నన్ను తీసికెళ్ళకపోతే మిమ్మల్ని వెళ్ళనివ్వను."

"మీ అన్నయ్య వచ్చాడా ?"

'ఈయన కెలాగ తెలిసింది ?' అనుకుంటూ తలూపేను.

"ఇలాగ చెయ్యమని వాడే చెప్పాడా ?"

మళ్ళీ తలూపేను.

"నేను నీ మాట వినకపోతే ?"

"రేప్పొద్దున్న...'

"రేప్పొద్దున్న వచ్చి నా సంగతి చూస్తానన్నాడా ? వాడన్నంతపనీ చేస్తాడు." అన్నయ్యంటే ఆయనకి భయమని తెలియగానే ధైర్యంగా తలెత్తి ఎన్నో కొరకొరా చూస్తుంటే తలదించుకున్నాను. "పొద్దున్నే వాడెక్కడనుండి వస్తున్నాడో అడగలేకపోయావా ? నువ్వెందు

ఆడుతూ వస్తోంది

# నాలికపై నడయాడే ఓ కొత్త రుచి
# తితిత్తై తితిత్తై.... చక్ర టీ

చిక్కనైన చిక్కదనం
మహోన్నతం రుచి. సువాసనా అత్యుత్తమం !

రసవత్తరమైన కొత్త టీ–
రసికులు ఊరట్లూగే... చక్ర టీ–
నాణ్యతలో అత్యుత్తమమైన
తేయాకు. కొత్త చక్ర టీ ఇదిగో–

రసి కాగ్రేసరులకు–
మరొక మణిపూసలాంటి
కొత్త ఉత్పాదన **చక్ర టీ**






**టాటా-ఫిన్లే**
ఉత్పత్తి

daCunha/TF/CHT/2 Tel

కడుగుతావు, నీ అన్న కదా? నన్ను వెళ్లనివ్వనన్నావు కదూ, వుండు నీ పని పట్టిస్తాను," అంటూ రెక్కపుచ్చుకు బరబరా గదిలో కీడ్చుకుపోయి తలుపేసేశారు

ఆవాళ్టి తరువాత ఆయన మళ్లీ రాత్రి నన్నొదిలి వెళ్లలేదు ఈ విషయం యింట్లోనే గాక ఇరుగుపొరుగుకి కూడా ఆశ్చర్యం కలిగించింది పందొమ్మిదో శతాబ్దంలో ఉదయించిన ఆరోజుల్లో అంతో యింతో వున్న వ్యక్తి సాని వీధి కెళ్లకుండా యింట్లో పెళ్ళాం కొంగు పట్టుకున్నాడంటే వింతే కదా! అయితే నా అందంతో ఆయన్నాకట్టడం ఏమంత కష్టంకాదని నేను గ్రహించినట్టే అందరికి అర్థమైంది ఇన్ని కష్టాలుపడి, బాధ్యతలు వహించి, కాన్పులతో వడిలిపోయిన శరీరం యాభై పైబడినా ఇప్పుడు కూడా బాగానేవుంటుంది — వయస్సులో బొట్టు కాటుకతో కళకళ్ళాడుతూ, వంటినిండా నగలతో ఎంతందంగా వుండేదాన్నో? మాసుకుందికి అద్దమా, పాడా?

చుట్టుపక్కల వాళ్లని ఆశ్చర్యచకితులను చేసిన మరో విశేషం, గయ్యాళి అత్తగారిని, ఆడబడుచుని వశపరచుకోడం ఆయన యింట్లో వుండటం మొదలుపెట్టినదగ్గిరనుండి వాళ్లిద్దరికీ నన్ను తిట్టే అవకాశం తగ్గిపోయింది. రెండు సార్లాయన చెవిని తిట్లు పడగానే వాళ్లని హెచ్చరించారు అప్పటినుండి అటునించటు ఆయన్ని 'చేతకానివాడు' 'మగతనం పోయింది' 'గాజులు తొడిగించుకున్నాడు' — నాకు వినబడేలా సంటూంటే కష్టంగా వుండేది దానికితోడు ఒకటికి రెండుసార్లు మూడేసి నెలల కడుపు పోయేసరికి వాళ్ల ఉసురు తగిలిందేమోనని అనుమానం వేసింది అన్నయ్య వాళ్ల నెలాగైనా మంచిచేసుకోమని చెప్పి వెళ్లాడు. ఏ ప్రయత్నం ఫలించక విసిగెత్తి ఈ మూరప్ప అత్తవారింటికేనా ఎందుకెళ్లదు?' అనుకుంటూంటే మంచి ఆలోచన వచ్చింది, 'ఆయనతో చెప్పి ఆమెను అత్తవారింటికి పంపిస్తే?'

మూరప్ప కాపరం మూణ్ణాళ్ళ ముచ్చటవడానికి పెద్ద కారణమంటూ లేదు ఆమె అత్తవారు వున్నవాళ్ళు కాదు పిల్లడు చదువుకుంటున్నాడు కదా అని మా మామగారు చేసేసారుట మూరప్ప వెళ్ళేసరికి కోమటి కొట్లో లెక్కలు చూసేవాడుట ఈమె వెళ్లిన కొన్నాళ్ళకే కోమటికొట్టు దివాలా తియ్యడంతో భర్త ఉద్యోగం పోయింది, వాళ్ళ పల్లెటూర్లో మళ్లీ పని దొరకలేదు కోడలొంటికి రాగానే యిలా జరిగింది కాబట్టి కోడలు నష్టజాతకురాలంటూ నానామాటలని పంపించేసారు ఇంటికొచ్చి నాడపిల్ల సంగతి యిక్కడా ఎవరూ పట్టించుకోలేదు — మామగారు పోయారు, ఆయనసలింట్లో ఏం జరుగుతున్నదో తెలుసుకునే ప్రయత్నమెప్పుడూ చెయ్యలేదు లేకపోతే 'వున్న ఊర్లో ఉద్యోగమంటే యెక్కడ దొరుకుతుంద'ని ఆమె భర్తకి నచ్చజెప్పరా?

ఆవేళ రాత్రి పడకగదిలో అన్నాను, "మీ చెల్లెల్ని అత్తారింటికి పంపిద్దామా?"

"అత్తవారింటికా? మీకు తెలియదా చిట్టీ, మూరప్పను వాళ్లు పంపించేసారు?"

"తెలుసు — కాని ఆమె భర్త కుద్యోగం వేయిస్తే..."

"నీకెందుకొచ్చిన బాధ?" మాటలతో కాలం దొర్లించడం యిష్టంలేనట్లన్నారు.

"ఆడబడుచు బాధ నాక్కాకపోతే యింకెవరికి?"

"ఓ అదా సంగతి," నవ్వుతూ అన్నారు.

ఆయన మర్నాడే వెళ్లి ఆమె భర్తకు నచ్చజెప్పి ఈ ఊరి ఎలిమెంటరీ స్కూల్లో మాస్టరుగా వేయించేరు మళ్లీ చీర, సారె పెట్టి భర్త దగ్గిరకి పంపడమేగాక అత్త, మామల పోరు లేకుండా చేసినందుకు మూరప్ప చాలా సంతోషించింది ఇప్పటికీ అంటుంది "నేను పిల్ల, పాపతో వున్నానంటే నీ చలవ, వదినా." ఆమె భర్తిప్పుడు హెడ్‌మాస్టరు

కూతురు కాపరం చక్కబెట్టినందుకు అత్తగారి మెప్పు కూడా పొందాను అందుకే ఈసారి కడుపుతో ఉంటే అపురూపంగా చూసింది. తీరా ఆడపిల్ల పుట్టేసరికి విసుక్కుందిగాని ఆవిడ పేరు నామకరణంలో వ్రాయించగానే మురిసిపోయింది. సత్యవతి పుట్టినప్పుడు బాధపడుతూ అంది, "మనవణ్ణెత్తుకున్న తరువాత కాశీ వెళ్దామనుకున్నాను నాకా అదృష్టమున్నట్లు లేదు"

ఆవిడకి కాశీ యాత్ర కోరికని తెలియడమే తడవు ఆయనతో చెప్పి ప్రయాణం కట్టించేను ఆవిడ వెళ్తూంటే అన్నాను, "కాశీ నుండి వచ్చేసరికి మనవడు పుడతాడు."

"నీ నోటి చలవుంటే వస్తానేమో. లేకపోతే కాశీ కెళ్ళినవాడు కాటికెళ్ళినవాడితో సమానం."

"అంత మాటనకండి," అన్నాను గాని అంతే ఎని జరిగింది, ఆవిడ తిరిగి రాలేదు

అన్నీ సవ్యంగానే జరిగాయి, అనుభవించే అదృష్టమే లేకపోయింది సత్యవతి తరువాత

---

## మళ్లీ మళ్లీ

ఘడియ ఘడియకూ
కాలాన్ని వెనక్కి నెట్టేస్తూన్న
ఘడియారపు ముల్లు
వచ్చిందార్లోకే వెళ్తోంది మళ్ళీ.

తూరుపు గర్భంలోంచి తొంగిచూసే సూర్యుడు
నిన్న పుట్టిందెక్కడో మరచినట్లు
ముందుకొస్తున్నాడు.

పొంగే జలధీ, విరిసే కౌముదీ
ఎప్పటిలాగే గతాన్ని నెమరేస్తున్నాయి

మనుషులు — పుడుతున్నారు, ఛస్తున్నారు
ఎప్పటికప్పుడూ ఏదో కొత్తదనం
అనుభవిస్తూ,

ప్రకృతిలో ప్రతిదీ పునశ్చరణమన్నది మరిచిపోతూ

— వె. [illegible]

---

# ముడివడిన

ముగ్గురు మొగపిల్లలు పుట్టి పోయేరు. మొగపిల్లడు పుట్టడేమోనని బాధపడుతూంటే వెంకడు కడుపులో పడ్డాడు. పుట్టబోయే బిడ్డ మొగవాడు కావాలని, బతికి బాగుండాలని ముక్కోటి దేవతలకి మొక్కుకున్నాను. దేవుడు నా ప్రార్థన వాలకించి వాడినిచ్చాడుగాని ఏడాది తిరక్కుండా ఆయన్ని తీసుకుపోయాడు.

కొంగుతో కళ్ళద్దుకుంటూ లేచాను. ఇంకా దేవుడింటి గుమ్మానికి ముక్కలు పెట్టాలి. ఏదో యింత మిగిల్పోయారు కాబట్టి సంసారం గుట్టుగా ఈడ్చుకొచ్చాను. ఆడపిల్లదద్దరికీ మంచి సంబంధాలు చూసి పెళ్ళి చేసాను. వెంకడికి కూడా... వాడి పెళ్ళి విషయంలో నా మాట చెల్లలేదు. పట్నంలో పుట్టిపెరిగి, చదువు కుంటున్న పెద్దింటి పిల్ల అణకువగా ఉంటుందా? "జానకి నాకు బాగా తెలుసును. చాలా నెమ్మదస్తురాలు, రెండు రోజులు నీ దగ్గిరుంటే నీకే తెలుస్తుంది, అమ్మా," అంది సత్యవతి. అదేగా సంబంధం తెచ్చింది — దాని మాట కాదనలేను వెంకడి చదువు కూడా దానిపట్టే. స్కూలుఫైనలయ్యాక ట్రైనింగ్ చేయించి మాస్టరుగా వేయిస్తే యిక్కడే యిల్లు — వాకిలి చూస్తూంటాడంటే కాదని, అది, దాని భర్త విశాఖపట్నం తీసికెళ్ళి కాలేజీలో చేర్పించారు. హాస్టలో, పాడో — అక్కడ తిండి పడక వేరే గది తీసికొని చేతులు కాల్చుకుంటున్నాడు. ఏదో బి యె. అయిపోతుందనుకుంటే యింకా అదేదో ఎమ్ ఎ చేస్తాడట. ఈ చదువుల కంతముండదు కాబోలు. శ్రావణ మాసం, పండుగకి కోడలు వస్తుంది రమ్మంటే క్లాసులు పోతాయి, రావని కబురు పెట్టాడు పైగా చదువైతేగాని పెళ్ళెందుకు చేసావంటాడు. ఇరవయ్యేళ్ళొస్తూంటే యింకా పెళ్ళి చెయ్యరా? కాని ఈ పిల్లని... సత్యవతందికదా అని చెయ్యకుండా ఉండవలసింది. చిన్నప్పటినుండి దాని కెదురు చెప్పలేను. అమ్మ పేరు చేర్చి పెట్టుకున్నాను కదా — పైగా అది అమ్మ నాలాగుంటుందంటారు. పెద్దదానిక్కూడా నా రంగు వచ్చింది కాని వెంకడు వాళ్ళ నాన్నగారి లాగ నల్లగా, పొడుగ్గా... పెళ్ళిలో జానకి పక్కన... బంగారుతీగలాగుంది పెళ్ళికూతురు. అన్నట్టు వాళ్ళు వచ్చే వేళయింది, నేనెదురు వెళ్తే బాగుండదు, మూరప్పను రమ్మనాలి. చేతులు కడుక్కుందికి పెరట్లో కెళ్ళాను.

### జానకి బాధ

"జానకీ, పాలు అబ్బాయికేనా? వెంకడికి పంచదారెక్కువ కావాలి."

'పెళ్ళై రెండున్నరేళ్ళైంది, ఆయనెంత పంచదార వేసుకుంటారో తెలియదా?' మనస్సులో అనుకున్నాను. జవాబు చెప్పడం అలవాటు లేదుగాని అన్ని విషయాల్లో జోక్యం కలిగించుకుంటూంటే చికాకేస్తుంది. అయినా మెల్లిగా అన్నాను, "పంచదారెక్కువే వేసాను."

అడుగులో అడుగు వేస్తూ ఆయన గదివేపు నడిచేను. వారం రోజుల సెలవలకొచ్చిన భర్త దగ్గిర కెళ్ళాన్నప్పుడుండవలసిన ఉత్సాహమెక్కడ

## జీవితాలు

లేదు. తలుపు మెల్లిగా తెరిచేను...అనుకున్నట్లుగానే మంచంమీద కూర్చొని పుస్తకాలతో కుస్తీ పడుతున్నారు. నన్ను చూడగానే యిబ్బందిగా కదిలి పెదవులమీద చిరునవ్వుని బలవంతాన తెచ్చారు. పాలగ్లాసందుకుంటూ, "పరీక్షలు దగ్గరకొచ్చాయి," అని నేనడక్కుండానే సంజాయిషీ యిచ్చి నన్ను పడుకోమన్నట్లు పక్కకు జరిగి మళ్ళీ పుస్తకాల్లో మునిగిపోయారు.

రెండు నిమిషాలలాగే చూస్తూ నిలబడ్డాను. ఏప్రిలు నెలలో అయే పరీక్షలకి డిశంబరు నెలలో మొదటిరోజు కూడా భార్య వేపు చూడనంత చదవాలా? ఎప్పుడూ యింతే. నెమ్మదిగా మంచమెక్కాను. అసలు చీమూ, నెత్తురు వున్న మనిషేనా? ఆడపిల్ల పక్కనున్నా చలనముండదేమి? ఇన్నేళ్ళల్లో పట్టుమని పదిసార్లైనా దగ్గరకు తీసారో లేదో. దీని భాగ్యానికి పిల్లలింకా పుట్టలేదని అత్తగారి పోరొకటి. మేము కలిసేదే కాలేజికి సెలవలిస్తేను— అదీ ఆయన ప్రైవేటు క్లాసులు మినహాయిస్తే. పోనీ గది ఎలాగా తీసికొన్నారుకదా, నన్ను తీసికెళ్ళకూడదా? పెళ్ళైన కొత్తల్లో నాన్నగారి మాటంటే చదువు పాడవుతుందని ఇష్టపడలేదు కాని పెళ్ళామంటూ నన్ను తీసికెళ్ళడానికి సిగ్గేమో అనిపిస్తుంది. ఈ మనిషి కానీడ మళ్ళీ పెళ్ళి చేస్తుందిట .. నేను గొడ్రాలినిట ... ఒక్క కొడుక్కి సంతానం కలగకపోతే వంశం నాశనమయిపోతుందిట ... యింకా...

నా అక్కసంతా ఎవరిదగ్గర వెళ్ళబోసుకొనేది? నాన్నగారికి చూచాయగా తెలిపింది. వెంటనే నా పరిస్థితి స్పష్టంగా వ్రాస్తే తీసుకుపోతానంటూ ఉత్తరం వ్రాశారు. నేను జవాబివ్వలేదు, ఆ కోపిష్టి మనిషన్నంత పనీ చేస్తారని. అప్పుడప్పుడెదురుపడుతూంటేనే ఈయన వరసిలాగుంది, పుట్టింటికెళ్ళిపోతే నన్ను మరిచిపోయి, ఆవిడ మరొక పిల్లని తెచ్చి 'తాళి కట్టరా' అంటే కట్టేస్తారేమో. తరువాత ఆమెను కూడా కావలిస్తే నన్నుంచినట్లే దూరంగా వుంచుతారేమో ... ఇక్కడినుండి వెళ్ళిపోతే నా గతేమిటి? మొగుడొదిలేసిన ఆడపిల్లకి మన సమాజంలో స్థానమేది? పోనీ స్కూలు ఫైనలైనా పూర్తిచెయ్యనివ్వలేదే? ఎలాగా ఆయనిక్కడుండరుకదా, ఆ ఏడాది పూర్తిచెయ్యనివ్వమని శ్రావణమాసం పండుగకు తీసికొచ్చినప్పుడు నాన్నగారడిగితే అత్తగారు ససేమిరా అన్నారు.

"అబ్బాయి సెలవలకి యిక్కడికొచ్చేది మా యింటికే వస్తాడు ఈ ఏడాది పరీక్షిచ్చిందంటే స్కూలు ఫైనలైపోతుంది," నాన్నగారు నచ్చజెప్పబోతే, ఆవిడన్నారు, "కొత్తకోడలు — ముద్దూముచ్చటా తీర్చుకోకుండా మీ యింట్లో వుంచేయడమేమిటి, అన్నయ్యగారూ? అయినా చదువుకొని ఊళ్ళేలాలా? ఏదో భగవంతుడిచ్చినదింతుంది — నాకు మాత్రం వాడొక్కడేకదా?"

ఆయనొక్కరవడమే నాకీ బాధంతా — అపురూపంగా కన్న కొడుకుని నేనెక్కడ వలలో వేసుకుంటానేమోనని భయమావిడకి. కళ్ళు విప్పాను. ఆయనకి నా ధ్యాసే లేదు. ఈ చదువైపోతే కూడా యిలాగే వుంటారా? ఎక్కడైనా ఉద్యోగమొస్తే తీసికెళ్తారా లేక యిక్కడే అత్తగారి దగ్గర...

"ఇంకా నిద్రపట్టలేదా? లైటు డిస్టర్బ్ చేస్తున్నాదేమో నేనవతలకి పోయి చదువుకుంటాను," ఆయన మాటలకి ఆలోచనల నుండి తేరుకొని అన్నాను, "నాకేమి యిబ్బందిలేదు బయట చలిగా వుంది, మీరు వెళ్ళొద్దు"

ఆయనవతల కూర్చుంటే హాయిగా నేనాయన మంచంమీద పవ్వళించేనని అత్తగారికి తెలుస్తే? ఏమనుకున్నారో పుస్తకాలు పెట్టేసి లైటార్పి పక్కన జేరేరు

### యంత్రం

కనీసం నీ గుండె 'టీ' స్పూనైనా కాదు?
నీ కొలతకి
నా గుండె సముద్రం ఎలా అందుతుంది?
నీ కళ్ళు నువ్ తినే స్టీలు పళ్ళేల్లానైనా లేవు,
కనీసం నువ్ నడిచే గచ్చుల్లానైనా లేవు —
సమస్త గోళాన్ని కడుపులో దాచుకున్న
నా దృగ్గోళం నీకెలా అర్థమవుతుంది?
ప్రకృతి మనస్తత్వాన్ని
ఏ కోణంలోంచి గమనించినా తెలుస్తుంది,
అచ్చమైన హృదయం ఎప్పుడూ
భౌతిక ధర్మాన్ని ప్రదర్శించదు.
సజీవ ఎయువాలెప్పుడూ
నిర్వచనాల రొంపిని చిమ్మవు.
ప్రపంచ సత్యంలోనే వుంది —
ప్రాణమనేది స్థిరరూప పరిమితమైందికాదని!
నదులు సముద్రాలవ్వొచ్చు.
సముద్రాలు మేఘాలవ్వొచ్చు.
మేఘాలు మళ్ళీ నదులవ్వొచ్చు

— **నందిని సిధారెడ్డి**

## వెంకటేశం గాథ

సముద్రం మీద ఉవ్వెత్తున లేస్తున్న కెరటాల్ని చూస్తూ కూర్చున్నాను. చీకటి అలుముకుంటున్నది. ఇంటి కెళ్ళేమిటి చేస్తాను? నేను, అమ్మ ... నేను చవటనవడానికి కారణం అమ్మేనేమో. లేక లేక పుట్టడంతో కాలు కింద పెట్టనివ్వలేదు. స్కూలుక్కూడా ఫస్టుఫారందాకా పంపలేదు. అక్కలిద్దరికీ పెళ్ళిళ్ళైపోతే ఇంట్లో నేనొక్కడినీ ... ఒంటరితనం దూరం చేసుకుందికి పుస్తకాలతో నేస్తం కట్టాను. సత్యవతక్క ధర్మమా అని పల్లెటూరి నుండి బయటపడి అమ్మ బారి నుండి తప్పించుకున్నానుగాని నలుగురితో కలియడం అలవాటులేని నాకు కాలేజీ జీవితంలో కూడా పుస్తకాలే స్నేహితులుగా మిగిలేయి. చదువుమీద శ్రద్ధ నన్నొక ఫస్టుక్లాసు స్టూడెంట్ చెయ్యడంతోపాటు 'టోటల్ ఇంట్రోవర్ట్'గా ... వాడుక భాషలో చెప్పాలంటే ఒంటెత్తువాడిగా వదిలిపెట్టింది నా ప్రపంచం నావరకే సీమితం, ఎవరితో మాట్లాడాలంటే, ఎవరినైనా కలియాలంటే బిడియం, జంకు. ఆఖరికి జానకితో...

జానకి ఎదురుపడితే కలిగే బెరుకును కప్పిపుచ్చుకుందికే పుస్తకాలు ముందేసుక్కూర్చునేవాణ్ణి. చదువు వంకబెట్టి సాధ్యమైనంతవరకు యింటికి వెళ్ళేవాడినికాదు ఉద్యోగం వచ్చాక ఒంటరిగా వుంటే లోకులేమనుకుంటారన్న భయంకొద్దీ తప్పనిసరిగా తీసుకురావలసి వచ్చింది అసలు నేను పెళ్ళే వద్దంటే బలవంతాన ఒప్పించారు సత్యవతక్క, బావ. అయితే జానకిని తప్పించుకు తిరగడానికి వేరే కారణముంది

మొదటి రాత్రి జానకి అందానికి దిగ్భ్రమ చెందాను. మేలిమి బంగారు రంగు, పొడుగుగాక, పొట్టిగాక, నాజూకుగా మోకాళ్ళవరకు వేలాడుతున్న జడతో గదిలో ప్రవేశించినామెను చూస్తూ ఎంతసేపుండిపోయానో నాకే తెలియదు నుదిటిమీద కళ్యాణం బొట్టు, పెద్ద పెద్ద కాటుక కళ్ళు, బుగ్గమీద నల్లచుక్క, మొనదేలిన ముక్కు, ఎర్రగా దొండపళ్ళలాగ పెదిమలు. పందిట్లో సన్నాయి మేళం ధ్వనిలో సన్నగా వినిపించిన మాటలు గుర్తొచ్చాయి. "కాకి ముక్కుకి దొండపండు..." ఆమె చేతిమీద వేసిన నా చెయ్యి నల్లగా అసహ్యంగా కనిపించింది. గబుక్కున వెనక్కి తీసేసుకున్నాను. అది మొదలు, ఆమెను చేరినప్పుడల్లా అదొక భావం .. అయితే నాలో తలెత్తిన 'ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్' మా జీవితాన్ని వేరు చేసేదాకా లాక్కొస్తుందని కలలో కూడా అనుకోలేదు నన్ను నేను కించపరుచుకోవడంవలన జానకిని చేరదీయలేకపోయేవాడిని కాని నా ప్రవర్తనతో ఆమెను బాధిస్తున్నానని, పిల్లలు పుట్టని కారణంగా అమ్మామెను అనరాని మాటలంటున్నాదని, నాకు మళ్ళీ పెళ్ళిచేసే ప్రయత్నంలో కూడా ఉందని నాకా రోజు మామగారొచ్చి నామీద అభాండం వేసి, అప్పటికప్పుడామెను తీసుకుపోయేదాకా తెలియదు

ఆ రోజు సాయంత్రం నేనింటికెళ్ళేసరికి మామగారు వచ్చి ఉన్నారు నేను గుమ్మంలో అడుగు పెడుతూంటే అమ్మంటున్నాది, "మీ అమ్మాయి కాపరానికొచ్చి నాలుగేళ్ళవుతున్నాదా, వంశోద్ధారకుడు పుట్టే సూచనలెక్కడా లేవు."

"మీవాడు చేతకానివాడైతే మా అమ్మాయేం జేస్తుంది?"

"ఏమంటున్నారు?"

"మీవాడు ఇంపొటెంట్ ...' అదే.. మగవాడు కాని వాడితో ఎన్నాళ్ళుంటేనేమిటి? జానకీ, యిలాంటి ఘర్షణ పడుతున్నావని వ్రాయలేదేమి? వెంకటేశంకి మళ్ళీ పెళ్ళి ప్రయత్నాలు జరుగుతున్నాయని తెలుస్తే చూసిపోదామని వచ్చాను నువ్వు తెలియజేస్తే ఎప్పుడో తీసుకుపోదును. పోని, ఇక్కడింకెందుకు, పద," మామగారు గొంతుక హెచ్చించారు

"నేను 'యింపొటెంట్'నా?" ఆశ్చర్యంగా

[ [illegible]వ పేజీ చూడండి ]

సీరియల్:

# సుదూర తీరాలు

పొట్లూరి విజయలక్ష్మి

( గత సంచిక తరువాయి )

వసంత నెమ్మదిగా కాంతిమతి దగ్గిర చేరి చెప్పింది "మల్లికకు ఏదో షాకు తగిలినట్లుంది అందుకే ప్రొద్దుటినుంచీ ఏది చెబితే అది చేస్తుంది తప్ప మరోమాట మాట్లాడటం లేదు సూర్యం చచ్చిపోయాడని తెలిసినట్లుగా కూడా లేదక్కా! అయోమయంగా వుంది మనిషి పాలకం అయితేనేం బుద్ధిగా ఏం చెబితే అది చేస్తోంది స్నానంచేసింది, యిప్పుడే జడవేసి వచ్చాను బొట్టు పెట్టుకొని రెడీగా వుండమని చెప్పొచ్చాను" అంది వసంత ఎంతో నమ్మకంగా

దీర్ఘంగా శ్వాస తీసుకుంది కాంతిమతి

"పోనీలే, సూర్యం చావు విషయం దానికి తెలీకపోతే వచ్చిన నష్టమేమీలేదు మనం చెప్పింది చెప్పినట్లు చేస్తుందికదా! మనకు కావలసిందంతే, నాలుగురోజులుపోతే మీ అందరితోపాటే అదీ తయారవుతుంది వూఁ త్వరగా వెళ్ళు నువ్వు కూడా డ్రెస్‌చేసుకొని రెడీ అవు ఇప్పటికే ఆలశ్యమైంది" అంటూ వసంతను లోపలికి తరిమి, తను వసంత గదిలో కూర్చొని బుద్ధిగా కడపాయలు వూడదీసి అల్లుకుంటూ ఏదో ఆలోచనలో నిమగ్నమైన మల్లిని సమీపించింది

మల్లిక దగ్గరగా వెళ్ళి చేతిలో వున్న మల్లెదండ పొడవాటి జడలో అందంగా అమర్చి 'మల్లికా! వీళ్ళందరిలోకీ, మంచిముత్యానివి నువ్వు నీ అందం ఎవ్వరికీ లేదు నువ్వు నా అదృష్టంకొద్దీ దొరికావు. కుమార్‌బాబు చూస్తే వదిలిపెడతాడా?" అంటూ మల్లికను ముద్దుపెట్టుకొని మెటికలు విరిచింది మౌనంగా నిలబడింది మల్లిక

"కుమార్‌బాబు వెంట వెళతావుకదూ! ఆయన జాగ్రత్తగా తీసుకొచ్చి వదిలిపెడతారు రెండురోజుల్లో ఆయన మరీ వుండమంటే మరోరోజు ఆ తర్వాత ఆయనవెంట బుద్ధిగా వచ్చేయాలి సరేనా?" అంటున్న కాంతిమతి వైపు చూస్తూ,

"అలాగే" అంటూ బుద్ధిగా తల వూపింది ఆ ముఖంలో ఏ భావం లేదు

వసంత చెప్పింది నిజమేననిపించింది కాంతిమతికి మల్లిక ఏదో షాక్ తింది బహుశా సూర్యం చావువల్లే అది కలిగివుండవచ్చు అయినా ఈ షాక్ తనకు వుపయోగకరమైంది తన చేయి దాటి పోదు మల్లిక తృప్తిగా నిట్టూర్చి వెనుదిరిగిన కాంతిమతికి వాకిట్లో కారు హారన్ వినిపించింది గబగబా హాల్లోకి పరుగెత్తింది

ఈలోపే పుష్ప రూమ్‌లోనుంచీ గమనిస్తున్న వసంత గబుక్కున మల్లిక వున్న రూమ్‌లో దూరింది.

మల్లిక చేయి పట్టుకొని వందరూపాయలు గుప్పిట్లో వుంచుతూ "జాగ్రత్త మల్లీ! యింతకంటే నేను నీకేమీ చేయలేకపోతున్నాను సాహసంచేసి తప్పించుకున్నావంటే బ్రతికిపోతావు ఎట్టి పరిస్థితుల్లోనూ ఈ వూళ్ళో వుండొద్దు తప్పించుకున్న మరుక్షణం సెంట్రల్ స్టేషన్‌కు వెళ్ళిపోయి, ఏదో బండి ఎక్కేయి నువ్వు మీ వూరెళ్ళిపోవడం ఉత్తమం తిట్టినా కొట్టినా అయినవాళ్ళ దగ్గర పడుంటే అదో దారి మద్రాసులో మట్టుకు వుండకు, ఏ మూలనున్నా పట్టేస్తుందీ రాక్షసి. డబ్బు నీ కవసరముంటుంది వుంచు ఈరకంగానైనా సూర్యం ఆత్మకు శాంతి చేకూర్చినదాన్నవుతాను" అంటున్న వసంత కళ్ళలో గిర్రున నీళ్ళు తిరగటం చూసిన మల్లిక కళ్ళలో కూడా నీళ్ళు కదలాడాయి

హాల్లో అడుగుల చప్పుడు మాటలు వినరావడంతో,

కొంచెం పెద్దగా "ఊ! ఊ! త్వరగా కానీయ్ మల్లికా! ఎంత సేపు? ఈ చీర బావుందా! యింకోటి కట్టుకుంటావా?" అంటున్న వసంత మాటలు విని హాల్లో కూర్చున్న కాంతిమతి తృప్తిగా నవ్వుకొని,

"చీర బాగానేవుందిగానీ మల్లికనిలా తీసుకురా వసంతా! బాబు త్వరగా వెళ్ళాలంటున్నారు. ఇంకా ఏవిటాలస్యం?" అంది హుందాగా

వసంత కళ్ళతోనే మల్లికను వారించింది

తన కళ్ళు తుడుచుకుంటూ మల్లిక చెంపలు కూడా అద్ది, పౌడర్ పఫ్‌తో అద్ది రమ్మన్నట్లు అభ్యర్థనగా చూసింది

కృతజ్ఞతగా వసంత చేయి నొక్కి,

"నీ ఋణం ఈ జన్మకు తీర్చుకోలేను వసంతా!" అని మెల్లగా వసంతతోపాటు వణుకుతున్న కాళ్ళతో హాల్లో అడుగుపెట్టింది మల్లి

తృప్తిగా కళ్ళింతింత చేసుకొని చూస్తున్న కుమార్‌బాబు వైపు చూస్తూ "ఏం బాబూ! ఎలావుంది మల్లిక" అంది వీసమెత్తు గర్వం తొణికిసలాడింది కాంతిమతి కంఠంలో

ఇంకో క్షణం సోఫాలో నిలవలేదు కుమార్‌బాబు

"మల్లెపూవులా వుంది కాంతిమతీ! యిక మేము వెళ్ళిరామా!" అన్నాడు ఆత్రంగా మల్లిక వైపు చూస్తూ

అతని తొందర గమనించి చిన్నగా నవ్వుకుంటూ, "వసంతా! మల్లికను లోపలికి తీసుకెళ్ళి, తెల్లజరీతోపాటు మరో రెండు చీరలు బాగ్‌లో సర్దియివ్వు' అని ఆజ్ఞాపిస్తూ కుమార్‌బాబు వైపు తిరిగింది

మల్లికను తీసుకొని గదిలో కెళ్ళింది వసంత

"బాబూ! మీకు తెలియందేముంది? కొత్తపిల్ల కొంచెం జాగ్రత్తగా వుండాలి ఎవరినైనా తోడు పంపుదామంటే."

"నో! నో! ఎవరూ అక్కర్లేదు నేను జాగ్రత్తగా రెండు మూడురోజుల్లో పంపిస్తాను" అంటూ మూడువేల రూపాయలు తీసి కాంతిమతి చేతిలో వుంచాడు

"బాబూ!" అంటున్న కాంతిమతి వైపు తిరిగి,

"అంతటితో నువ్వు తృప్తిపడవని తెలుసులే మిగతాది మల్లికతోపాటు మల్లెపూలలో పెట్టి అప్పగిస్తాను సరేనా? త్వరగా పంపాలి, మరి నాకు టైమ్ అవుతోంది" అంటూ తొందర చేశాడు కుమార్‌బాబు

ట్యూబ్‌లైట్‌లా వెలిగింది కాంతిమతి ముఖం.

గబగబా మల్లిక రూమ్‌లో కెళ్ళింది "వసంతా! బాగ్ సర్దావా" అంటూ

"సర్దానక్కా!" అంది కానీ వసంతకు భయంగావుంది ఎక్కడ తెరిచి చూస్తుందో అని

**జరిగిన కథ-7 :** స్కూలు మాస్టరు దశరథరామయ్యగారి కుమారుడు మాధవ్ ఓ కంపెనీలో మేనేజర్. వారింట్లో వంట చేస్తున్న అన్నపూర్ణమ్మ కూతురు మల్లిచే మాధవ్ తను వ్రాసిన పాటలు పాడించుకొంటూ పరస్పరానురాగబద్ధులవుతారు కాని అతని పల్లెటూరి వేషధారణ మాత్రం ఆమెకు నచ్చదు మున్సబుగారు మాధవ్‌ను తన అల్లుడిగా చేసుకోవాలని పథకం వేస్తుంటాడు మల్లిని మంచి గాయనిగా గుర్తించి తమ పిక్చర్‌లోని పాటలు పాడటానికి, గొప్ప గాయనిగా పేరు ప్రతిష్టలు పొందటానికి తనతో మద్రాసు రమ్మని అర్థిస్తాడు సూర్యం. అతని మాటలను నమ్మిన మల్లిక ఆ మరునాటి రాత్రి ఎవ్వరికీ చెప్పకుండా అతనితో వెళ్ళిపోతుంది. ఆ కారణంగా ఆమె తల్లి ఆ అవమానం భరించలేక ఆత్మహత్య చేసుకొంటుంది. సూర్యం అసలు రంగు ఆమెకు అవగాహన అవుతూవుంటుంది. అతను అందమైన అమ్మాయిలను ఆకర్షించి, తను అనుభవించి కాంతిమతికి అప్పచెప్తుంటాడు. అతను పన్నిన వలలో చిక్కుకున్న మల్లిని కూడా అనుభవిస్తాడు కాని ఆమెకు అన్యాయం చెయ్యలేక వివాహానికి ఆమె అనుమతిని కోరతాడు. ఇక వేరే గత్యంతరం లేక తన మెడలో పసుపుకొమ్ము తనే కట్టుకొని సూర్యం కట్టినట్లుగా భావించుకొంటుంది మల్లి ఆ విషయం రాముా ద్వారా తెలుసుకున్న కాంతిమతి సూర్యంను చంపిస్తుంది. ఈ విషయం పోలీసులకు చెప్పటానికి వెళ్తున్న రామూని కొట్టిస్తుంది మల్లికి ఆ నరకకూపమునుంచి తప్పించుకొనే మార్గం చెబుతుంది వసంత.

# క్రొత్తగా! వేడివేడి వడ్డనలకు ఇగ్లూ హాట్‌ప్యాక్, వండి నాలుగు గంటలైనాసరే ఎంతో కమ్మదనము




ఎంతసేపైనాసరే, 4 గంటలదాకా అప్పటి కప్పుడు వండినట్లు తాజాగా వేడిగా పొగలొస్తూ, రుచిగా కమ్మగా వుంటాయి.

**కాలము-ఇంధనము ఆదా :**

ఇగ్లూ హాట్‌ప్యాక్ వాడితే తిరిగి వేడిచేసి వడ్డించే అవసరంలేదు. ఆ రోజులు పోయినాయి. ఎంతో తీరిక వుంటుంది. ఖర్చు తక్కువగా వంట అవుతుంది. సాధారణంగా తిరిగి వేడిచేస్తే ఆహారంలో సత్తువపోతుంది.

ఇగ్లూ హాట్‌ప్యాక్ సుప్రసిద్ధమైన జనరల్ స్టోర్సులలో కావలసిన సైజులో లభిస్తుంది. ఇవ్వాళే ఇగ్లూ హాట్‌ప్యాక్ ఇంటికి తీసుకు వెళ్ళండి. మీకన్నీ లాభాలే. ఇంకా ఎంతో తీరిక కూడా!

**ఇదే నిదర్శనము !**

ఈ ప్యాక్‌ను రెండు నెలలపాటు వుపయోగించి పరిశోధించి, మద్రాసులో పాకశాస్త్రమునకు సంబంధించిన ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ క్యాటరింగ్ టెక్నాలజీవారు చెప్పినది గమనించండి :
"ఇందులో వేడి నిల్వశక్తి చాలా బాగా వుంటుంది తాజాతనము ఎంతమాత్రము చెడదు... 8 గంటల తరువాత కూడా రుచి ఏమీ తగ్గదు. ఇవి చాలా సమర్థవంతమైనవి."

**మళ్ళీ వేడిచేయడం అంటూ వుండదు :**

ఇప్పుడు వంట త్వరగా చేసుకోండి. కూరలైనా, పులుసైనా, అన్నమయినా సరే, క్రొత్తగా వచ్చే ఇగ్లూ హాట్‌ప్యాక్‌లో పెట్టి మూతపెట్టండి.

**IGLOO hotpack**

మెట్రోప్లాస్టువారి తయారీ



మెట్టూర్ బియర్డ్‌సెల్ లిమిటెడ్

OBM 4897/76

డిస్ట్రిబ్యూటర్లు :

| కోస్తా ఆంధ్రప్రదేశ్ : | తెలంగాణా : |
|---|---|
| ఇండియన్ ట్రేడ్ కార్పొరేషన్, | మెస్సర్స్ కృష్ణ ఏజన్సీస్ |
| 11-37-25, చిప్పడివారి వీధి. విజయవాడ-1 | 22 4-477 ఎబిడార్ హాక్ హైదరాబాదు-500002. |



# సుదూర తీరాలు

కానీ ఆ హడావుడిలో కాంతిమతికి ఎందుకో ఆ చీరలేవిటో చూడాలనిపించలేదు

మల్లిక కోరికతో రెండే రెండు చీరలు పెట్టింది వసంత అవికూడా చాలా మామూలు చీరలు వాయల్‌వి

కుమార్‌బాబుతో పాటు కార్లో కూర్చున్న మల్లిక గుండెలు వేగంగా స్పందించడం మొదలెట్టాయి గుమ్మంలో నుంచున్న కాంతిమతి వాటంతముఖం చేసుకొని చూస్తోంది

ప్రక్క కిటికీలోనుంచి మిలమిలా మెరుస్తున్న రెండు కళ్ళు వసంతవని తెలుసుకున్న మల్లిక కళ్ళతోనే వీడ్కోలు తీసుకుంది

చాలా హుషారుగా వున్నాడు కుమార్‌బాబు ఏవేవో ప్రశ్నలు వేస్తున్నాడు, కొన్నింటికి సమాధానాలు తనే చెప్పుకుంటున్నాడు మల్లికచేత మాట్లాడించాలనీ, ప్రయత్నం చేస్తున్నాడు ఏవో ఒకటి రెండు ప్రశ్నలకు సమాధానాలు చెప్పింది అవీ సాధారణమైన ప్రశ్నలు

'ఎంతవరకు చదువుకున్నావు? ఏ రచయిత అంటే యిష్టం? సాహిత్యమంటే అభిరుచి వుందా?'' లాంటివి.

అతని మాటల్నిబట్టి అతను విపరీతంగా పుస్తకాలు చదువుతాడని అర్థమైంది మల్లికి

"సాహిత్య చర్చలో కూర్చుంటే నాకు గంటలు నిముషాల్లా దొర్లిపోతాయి మల్లికా! ఆ వసంతక్కూడా పుస్తకాల పిచ్చి చాలా వుంది అయితే ఆవిడకు మెడికల్ పుస్తకాల పిచ్చి నీకు శరత్ రచనలు యిష్టమన్నావుకదూ! గుడ్ టేస్ట్." అలాగే దారిపొడుగూతా ఏవేవో మాట్లాడుతూనేవున్నాడు

గెస్ట్ హవుస్‌కు చేరుకోగానే ఫ్రిజ్‌లో నుంచి బాటిల్స్ సోడాలూ తీసుకొని కూర్చున్నాడు కుమార్‌బాబు. వెంటనే వసంత మాటలు జ్ఞాపకం వచ్చాయి మల్లికకు చొరవగా బాటిల్ చేతిలోకి తీసుకొని గ్లాసు సగానికి నింపేసింది

"చాలు చాలు! ఏమో అనుకున్నాను మంచి ఎడ్వాన్స్‌డేనే, నీకేమైనా అలవాటుందా?" అన్నాడు గ్లాసులో సోడా కలుపుకుంటూ

ఖంగారుగా తల అడ్డంగా వూపింది.

"దట్సగుడ్! త్రాగనివాళ్ళను నేను ఫోర్స్ చేయను గాజుల చేతులో అందిస్తే ఎంతైనా గటగటా తాగేస్తాను" అంటూ మల్లిక చేయి పట్టుకొని ఆ బాటిల్‌లోది అలాగే నోట్లోకి వంపుకున్నాడు

త్వరత్వరగా గ్లాసులు నింపి, నవ్వు పెదాల మీద పులుముకుని అతని కందిస్తోంది మల్లిక.

ఆమె కళ్ళలోకి చూస్తూ కళ్ళతోనే ఆ సౌందర్యాన్ని మధువుతో కలిపి తాగుతున్నాడు కుమార్‌బాబు. మాటలు ముద్దముద్దగా వస్తున్నాయి.

"ఇంక చాలు మల్లికా! డిన్నర్ తీసుకుందాం' ఇక్కడెవరూ వుండరు మరి నువ్వు ఆ ప్రక్కన కారియర్, ప్లేట్స్ వున్నాయి పట్టుకొచ్చి వడ్డిస్తావా?" అన్నాడు ముద్దముద్దగా కళ్ళు మూతలుపడుతున్నాయి అప్పటికే

మరో గ్లాసు నింపుతున్న మల్లిక వైపు చూసి నవ్వుతూ,

"నీకు తాగించడం సరదాలాగుందే కానీ.. నీ ఇష్టప్రకారమే కానీయ్. నువ్వు పోసిందంతా

[ 3 వ పేజీ చూడండి ]

# అరుణోదయపు కాంతులతో ఆకాశం బంగారు రంగు నింపుకుంది. కోటి గొంతులు అంజలి ఘటిస్తున్నాయి.



భారతదేశంలో ప్రజలలో ఎంత వైవిధ్యం వుందో, ఆరాధన కూడా అన్ని రూపాలు దాల్చింది--సంగీత నృత్యాలుగా. ప్రాచీన కట్టడాలపై సజీవ శిల్పాలుగా, పుష్పాంజలిగా. కమ్మటి వాసనలను వెదజల్లే అగరు వత్తులుగా. రెపరెపలాడే ప్రమిదెల జ్యోతుల్లా.

**భక్తివిశ్వాసాల విశ్వరూపం.**

కాశ్మీర్‌లోని అమర్‌నాథ్ నుంచి కన్యాకుమారి వరకు. సోమ్‌నాథ్ నుంచి భువనేశ్వర్ వరకు. అన్నీ కూడా ప్రగాఢ విశ్వాసాలకు ప్రతీకలు.

**బుద్ధుని అడుగుజాడలలో**

బుద్ధ గయ, సాంచి, అజంతా, లదాక్‌లలో కూడా తథాగతుని సందేశం తెలుసుకొనండి.

**గురువు చూపించిన మార్గం**

దేశంలో అనేక చోట్ల గురుద్వారాలు. అది అమృత్‌సర్ స్వర్ణ దేవాలయం కావచ్చు లేదా మంచు శిఖరాల మధ్య హేమ్‌కుండ్ సాహిబ్ కావచ్చు.

**ప్రవక్త పిలుపు**

ప్రవక్త అనుయాయిలు అజ్మీర్ దార్గాహ్, ఢిల్లీ జమా మసీదు, ఫతేపూర్ సిక్రిలోని సలీం చిస్తీ గోరీ దగ్గర దక్షిణాదిని నాగోర్‌లోను చేరతారు.

**మానవ రక్షకుని మార్గంలో**

విముక్తి మార్గంలో పయనిస్తే కేరళ, గోవా, ఇంకా అనేక వేల చర్చిలు తగులుతాయి.

**జీవితంపట్ల భక్తి**

దిల్‌వారా దేవాలయాలు, మౌంట్ ఆబు, పాలిటానా, రణక్‌పూర్, కలకత్తాలలో వంటి ప్రాచీన కట్టడాలలో మహావీరుని బోధలు మలచబడ్డాయి.

**రండి, మీ మతాన్ని అన్వేషించండి.**

మీరు మీ విశ్రాంతి కాలాన్ని పొడిగించేందుకు ఇంకా ఎన్నో కనబడతాయి.





ఇండియన్ ఎయిర్‌లైన్స్‌కు భారతదేశంలోని 62 కేంద్రాలకు, ఆరు పొరుగు దేశాలలోని 7 కేంద్రాలకు సర్వీసులు ఉన్నాయి. అక్కడ నుంచి గమ్యాలకు చేర్చే సదుపాయాలు—కొద్ది గంటలలోనే.



## ఇండియన్ ఎయిర్‌లైన్స్

మీ ట్రావెల్ ఏజెంట్‌తో సంప్రదించండి. మీరు కలలుకనే విశ్రాంతి ప్రయాణానికి ఈ రోజే ఏర్పాట్లు చేసుకోండి.



## యాత్రికుల ప్రగతి

# సినిమా

## ఇల్లే స్వర్గం

"నవంబర్‌లో డబ్బింగ్, రీ రికార్డింగ్ పూర్తి చేసుకొని, డిసెంబర్‌లో విడుదల చేయాలను కుంటున్నాం," అన్నారు నటరాజా ఆర్ట్ క్రియేషన్స్ "ఇల్లే స్వర్గం" వర్ణ చిత్రాన్ని సమర్పించే వేంద్రపు శంకరరావు చంద్రమోహన్, మాధవి, రోజారమణి, పద్మనాభం, నాగభూషణం, అల్లు రామలింగయ్య, సాక్షి రంగారావు, పొట్టి ప్రసాద్, రాంబాబు, పుష్పకుమారి, ఛాయాదేవి, దాసరి గోపాల్, అనిత, నిర్మల, రవికాంత్ పాల్గొన్నారు బొల్లిముంత శివరామకృష్ణయ్య మాటలు, రమేష్‌నాయుడు స్వరలహరిలో దేవులపల్లి, శ్రీశ్రీ, ఎం రామకృష్ణ గీతాలు రాశారు బాబూరావు ఛాయాగ్రాహకుడు రంగారావు శిల్ప దర్శకుడు అడుసుమిల్లి వెంకటేశ్వరరావు, నెరుసు సూర్యనారాయణ నిర్వహణలో శంభంగి అప్పారావు, చీకటి ఆంజనేయులు, దాసరి గోపాలకృష్ణ నిర్మాతలు ఎన్ కామేశ్వరరావు, డి వి ఎస్ డి ప్రసాద్ సహనిర్మాతలు గార సత్యనారాయణమూర్తి దర్శకుడు

## రోజులు మారాలి

అప్సర ఆర్ట్స్ "బొమ్మలకొలువు" వర్ణ చిత్రం డిసెంబర్‌లో విడుదలవుతుందని తెలియజేస్తూ, నిర్మాత వాశిరాజా ప్రకాశం "జనవరి నుంచి చంద్రమోహన్ హీరోగా 'రోజులు మారాలి' అనే ప్రయోగాత్మక, వినోదాత్మక చిత్రాన్ని ప్రారంభిస్తున్నాం మన రాష్ట్రంలోని ఒక గ్రామానికి సంబంధించిన కథ యిది కథ నేనే రాశాను బొల్లిముంత శివరామకృష్ణయ్య గారు సంభాషణలు రాస్తున్నారు," అన్నారు ఎస్ రాజేశ్వరరావు సంగీతం, భాస్కరరావు ఛాయ, సూరపనేని కళాధర్ శిల్పం, సి కృష్ణారావు సహకార దర్శకత్వం నాయుడు – కోటిలింగం నిర్మాణ బాధ్యతలు నిర్వహిస్తారు తదుపరి ప్రతిష్ఠాత్మక చిత్రం "తెలుగుతల్లి" ఏప్రిల్‌లో ప్రారంభమవుతుంది శారద నాయిక

## విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్

"డిసెంబర్ 17న షూటింగ్ ప్రారంభిస్తున్నాం," అన్నారు "మొనగాడు, బంగారు చెల్లెలు" అనంతరం కె రాఘవేంద్రరావు దర్శకత్వంలో కొత్త చిత్రాన్ని కృష్ణ, శ్రీదేవి జంటతో నిర్మించే టి త్రివిక్రమరావు జంధ్యాల, సత్యానంద్ కథకులు సత్యానంద్ సంభాషణలు రాస్తున్నారు చక్రవర్తి సంగీత దర్శకుడు కె ఎస్ ప్రకాష్ ఛాయాగ్రాహకుడు

## హృదయం ఉన్న మనిషి

రజతోత్సవం జరుపుకున్న ఎ వి ఎం వారి 'ఉయర్‌న్‌ద మనిదన్" తమిళ చిత్రానికి తెలుగు పరివర్తనం రాజలలితా పిక్చర్స్ "హృదయం ఉన్న మనిషి" శివాజీగణేశన్, వాణిశ్రీ, జానకి, భారతి, శివకుమార్ నటించారు శివాజీ అభినయానికి జగ్గయ్య కంఠం మరో ఆకర్షణ రాజశ్రీ రచన, ఎం ఎస్ విశ్వనాథం – సత్యం సంగీతం గల ఈ చిత్రానికి ఎస్ విద్యాసాగర్, బి కాం నిర్మాత



'కదిలి వచ్చిన కనకదుర్గ'లో ఒక దృశ్యం

'సినిమా పిచ్చోడు'లో ఒక దృశ్యం



## "సీతే రాముడైతే!" లో సీతారాముల తొలి చూపులు

రాము (శంకర్‌నాగ్) బొమ్మ గీస్తుండగా రివ్వున ఒక ఫుట్‌బాల్ దూసుకువచ్చి అతనికి తగిలింది దాంతో ఏకాగ్రత చెడింది ఇంతలో కొంతమంది పిల్లలు అక్కడ నక్కి నక్కి చూస్తూ "సార్, సార్! బంతివ్వండి, సార్!" అన్నారు వాళ్ళకు బంతి ఇచ్చి పంపేశాడు రాము ఇలా మూడుసార్లు జరిగింది చివరికి రాము కోపంగా పిల్లల వంక చూస్తూ, బంతిని ఒక్కతన్ను తన్నాడు అది కాస్తా పరాపరి వెళ్ళి, చట్టిలో వున్న పిండి మీద పడి, పిండి రుబ్బుతున్న గీత (జయసుధ) మీద చిందింది పిల్లలంతా ఒక్కసారి గొల్లుమని నవ్వారు సీతకు కోపం ఆగిందికాదు "నోరుముయ్యండిరా! ఇంతసేపూ రుబ్బిన పిండినంతా పాడుచేసి, పైగా నవ్వుతున్నారా?" అంది

"మేము కాదక్కా బాల్ వేసింది ఆ పక్కింటికి ఒక కొత్తమనిషి వచ్చాడు. ఆయనక్కా," అన్నారు పిల్లలు

"కొత్తవాడా! వాడికింకా నా విషయం తెలియదనుకుంటాను ఒరేయ్, బతాజీ! పదండిరా పోదాం," అంటూ సీత బయలుదేరింది. బంతి తగలడంచేత పడిపోయిన కాన్వాస్‌ను సర్దుకుంటున్నాడు రాము

"ఇతనే అక్కా, ఆ బాల్‌ను తన్నింది బాగా దబాయించు," అన్నాడొక కుర్రాడు

"ఎందుకు?" అన్నాడు రాము

"ఫుట్‌బాల్‌ను ఎందుకండీ తన్నింది?" అడిగింది సీత.

"చూడు – అక్క మొహం ఎలా అయిందో!" అన్నాడు మరో అబ్బాయి.

"ఓహ్! అయామ్ వెరీ సారీ! అయామ్ వెరీ వెరీ సారీ," అన్నాడు రాము. అతను వేసిన పెయింటింగ్ వంక సీత చూస్తుండేసరికి, "ఓ – అదా? పెయింటింగ్. ఐయామ్ ఎన్ ఆర్టిస్ట్," అన్నాడు.

సీత చరచరా వెళ్ళి కాన్వాస్ దగ్గరున్న కుంచెతో ఆ బొమ్మను పాడుచేసింది "మీరు నా మొహం చెడగొట్టారు నేను మీ పెయింటింగ్ చెడగొట్టాను," అంది

"దెబ్బకు దెబ్బ!" అని ఒక అబ్బాయి, "పంతానికి పంతం," అని మరో కుర్రాడు అన్నారు

"మీ అక్క పేరేమిటి? అంత కోపం ఎందుకయ్యా? ఇక నుంచి మనమందరం ఫ్రెండ్స్‌గా వుందాం ఏం?" అంటూ సీత దగ్గరగా వెళ్ళి, "మిస్! మీరన్నా చెప్పండి," అన్నాడు రాము

"చెప్పకక సీతక్కా! మా సీతక్క తన పేరును ఎవరికీ చెప్పదు," అన్నాడొక అబ్బాయి

"ఓ! మీ పేరు సీతనా!" అని రాము నవ్వుతూ అనేసరికి సీత ముఖం ఎరుపెక్కింది "పదండి పోదాం," అని కోపంతో, ఆ కుర్రాళ్ళతో నిష్క్రమించింది

ఆమె వెళ్తున్న వైపే చూస్తూ, రాము తనలో తాను నవ్వుకున్నాడు

"సీతా రాము" కంటే "సీతే రాముడైతే" అన్న పేరు అనువుగా వుంటుందని అలా పేరు మార్చడం జరిగిందని తెలియజేశారు దర్శకుడు బోయిన సుబ్బారావు జి డి ప్రసాదరావు, పి శశిభూషణ్ ఈ చిత్ర నిర్మాతలు

### కొత్తపేట రౌడీ

సత్య చిత్ర వారు నవంబర్ 7 న పాటల రికార్డింగ్‌తో పాటు షూటింగ్ కూడా ప్రారంభించిన వన్నెల చిత్రానికి పై పేరు పెట్టినట్లు చెప్పారు నిర్మాతలు సత్యనారాయణ, సూర్యనారాయణ కృష్ణ, జయప్రద, సత్యనారాయణ, మాతన్‌ప్రసాద్, మోహన్‌బాబు, చిరంజీవి, పి ఎల్ నారాయణ, రాళ్ళపల్లి, జ్యోతిలక్ష్మి, హలం పాత్రధారులు తెరవెనుక ముళ్ళపూడి వెంకటరమణ, మహదేవన్, వేటూరి, వి. ఎస్. ఆర్. స్వామి, ఎస్. కృష్ణారావు, కోటగిరి గోపాలరావు కృషి చేస్తున్న ఈ చిత్రానికి పర్వతనేని సాంబశివరావు దర్శకుడు.

'తొలికోడి కూసింది'లో సీమ





'సమాజానికి సవాల్'లో ఒక సన్నివేశం

## విడుదలకు సిద్ధంగా ఉన్న "మంగళ తోరణాలు"

"మా చిత్రానికి సెన్సార్‌వారు క్లీన్ సర్టిఫికేట్ ఇచ్చారు," అన్నారు పి వి రమణయ్య ఈయన నిర్వహణలో కృష్ణ-షా నిర్మించిన "మంగళ తోరణాలు" వర్ణ చిత్రానికి సంగీతం శ్రీనివాసరావు దర్శకుడు.

## శ్రీశ్రీ సంభాషణలు

విశ్వశాంతి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే స్వంత చిత్రం "హరిశ్చంద్రుడు" (సాంఘికం)లో జయచిత్ర, సావిత్రి, దేవిక, ప్రభాకరరెడ్డి, ఎం రంగారావు, బోసుబాబు, ఎన్. వి. ఎస్. ప్రసాదరావు, చలపతిరావు, సూర్యప్రకాశరావు, సూతంపాటి సాంబయ్య నటిస్తున్నారు కొండవీటి వెంకటకవి సంభాషణలకర్త ఆయనతోపాటు శ్రీశ్రీ రాసిన గీతాలకు తాతినేని చలపతిరావు స్వరకల్పన చేశారు. మోహనకృష్ణ ఛాయ, ఆర్ హనుమంతరావు కూర్పు నిర్వహిస్తున్నారు కె రాధాకృష్ణ నిర్మాణ నిర్వాహకుడు

మన సత్యం మూవీస్ డాక్టర్ తాళ్ళూరి కృష్ణకుమారి నాయికగా మన సత్యం నిర్మించే చిత్రానికి శ్రీశ్రీ సంభాషణలు రాస్తున్నారు

## "రాజాధిరాజు"

బాపు దర్శకత్వంలో ఎస్ జయలక్ష్మి, శ్రీమతి ఆర్ డి రెడ్డి నిర్మించే రామ చిత్రవారి వర్ణ చిత్రం తొలి షెడ్యూల్ బెంగళూరులో జరిగింది రెండవ షెడ్యూల్ నవంబర్ 14 నుండి 27 వరకు రాజమండ్రికి నలభై మైళ్ళ దూరంలో ఉన్న 'దేవీపట్నం' వద్ద జరిగింది ఈ చిత్రాన్ని సమర్పించే 'కరుణామయుడు' విజయచందర్ సరసన సుమలత నాయిక శారద, మాతవ్‌ప్రసాద్, ముక్కామల, హరిబాబు, శ్రీకన్ ఇతర ముఖ్య భూమికలు నిర్వహిస్తున్నారు. ముళ్ళపూడి వెంకటరమణ రచన, మహదేవన్ సంగీతం, బాబా (బొంబాయి) ఛాయ ఇతర ఆకర్షణలు చివరి షెడ్యూల్ బెంగళూరులో డిసెంబర్‌లో జరుగుతుంది.



'దేవుడిచ్చిన కొడుకు'లో ఒక దృశ్యం

## అమృతా ఫిలిమ్స్ 6 వ చిత్రం

మన్నవ బాలయ్య, బి ఇ, కథ సమకూర్చి సమర్పించే వర్ణ చిత్రంలో ద్విపాత్రాభినయం నిర్వహించే కృష్ణ సరసన శ్రీదేవి, కవిత నాయికలు రావుగోపాలరావు, నూతన్‌ప్రసాద్, సూర్యకాంతం, నిర్మల, జయవిజయ, మమత, మిక్కిలినేని, గౌరవ తారాగణంలో బాలయ్య, సత్యేంద్రకుమార్ వున్నారు నవంబర్ 17 న మూడు పాటలు రికార్డ్ చేయబడ్డాయి డి వి నరసరాజు సంభాషణలకర్త ఎం విశ్వనాథం స్వరలహరిలో ఆత్రేయ, సి నారాయణరెడ్డి, కొసరాజు గీతాలు రాశారు ఎస్ ఎస్ లాల్ ఛాయ, వీరప్ప కూర్పు, కె ఎల్ ధర్ శిల్పం, రెడ్డి కాళిదాసు ప్రొడక్షన్ బాధ్యతలు నిర్వహిస్తున్నారు జనవరి 1 న షూటింగ్ ప్రారంభింపబడుతుందని తెలియజేశారు నిర్మాతలు అలపర్తి సూర్యనారాయణ, మన్నవ వెంకట్రావు

### రాణీ కాసుల రంగమ్మ

"కేటు — డూప్లికేటు చిత్రానికి ముందుగా 'రాణీ కాసుల రంగమ్మ' అనే చిత్రాన్ని నిర్మించబోతున్నాం ఇందులో అందరూ కొత్తవారే నటిస్తారు," అన్నారు అనిల్ ప్రొడక్షన్స్ అధినేత తాతినేని ప్రకాశరావు ఫిబ్రవరి, మార్చి నెలల్లో మన రాష్ట్రంలోనే షూటింగ్ జరిగే ఈ చిత్రానికి టి ఎల్ వి ప్రసాద్ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు దాసం గోపాలకృష్ణ సంభాషణలు, చక్రవర్తి సంగీతం, దేవరాజ్ ఛాయ తెరవెనుక హంగులు

### మారని చరిత్ర

పై పేరున ఒక వర్ణ చిత్రాన్ని ఎ : రంగారావు దర్శకత్వంలో ఎం లక్ష్మణరావు నిర్మిస్తున్నారు నవంబర్ 8న లక్ష్మీకాంత్ స్వరకల్పనలో విజయరత్నం గీతాలు ధ్వనిముద్రిక చేయబడ్డాయి బి రామచంద్రరావు, పి నాగేశ్వర రావు నిర్మాణ బాధ్యతలు వహిస్తున్నారు

### అసాధ్యులకు అసాధ్యుడు

"మొనగాళ్ళకు మొనగాడు"లాంటి యాక్షన్ థ్రిల్లర్ సమర్పించిన సేలం మాడరన్ థియేటర్స్ అధిపతి ఆర్ సుందరం దర్శకత్వంలో జి. నిత్యానందం, జి సదానందం నిర్మించే వర్ణ చిత్రానికి పై పేరు పెట్టారు. రామకృష్ణ హీరో శ్యామ్ సంగీత కల్పనకు కృష్ణమూర్తి బాణీలు కూర్చారు నటరాజ్ ఛాయ, దాశరథి కూర్పు, గణేశ్ — రమణ నిర్మాణ బాధ్యతలు వహిస్తున్నారు శ్రీ గణేశ్ పిపి ఆర్ట్స్ నిర్మాణం

### స్వరోత్సవం

యాభై చిత్రాలకు దర్శకత్వం వెలువరించిన మధుసూదనరావును ఆయనవద్ద దర్శకత్వ శాఖలో పని చేసిన 56 మంది నవంబర్ 11 న దక్షిణ భారత కళాకారుల సంఘం ఆడిటోరియమ్‌లో ఘనంగా సన్మానించారు విఖ్యాత దర్శక నిర్మాత రాజ్ కపూర్ అధ్యక్షత వహించారు చలనచిత్ర పరిశ్రమకు చెందిన ప్రముఖులెందరో సన్మానితుని వ్యక్తిత్వ విశేషాలను, గుణగణాలను ప్రస్తుతించారు

## తారకప్రభు ఫిలిమ్స్ చిత్రాలకు దాసరి శిష్యుల దర్శకత్వం

దాసరి నారాయణరావు రచించి, సమర్పించే "సుజాత" వర్ణ చిత్రానికి దుర్గా నాగేశ్వరరావు దర్శకుడు ద్విపాత్రాభినయం నిర్వహించే సుజాత సరసన మురళీమోహన్, మోహన్‌బాబు ముఖ్య భూమికలు నిర్వహిస్తారు

మే 4న ప్రారంభింపబడే "చందమామ" వర్ణ చిత్రానికి రేలంగి నరసింహారావు దర్శకుడు

పై రెండు చిత్రాలకూ సాంకేతికవర్గం దాసరి యూనిట్‌లోనివారే

## టి వి. ఫిలిమ్స్ 2 వ చిత్రం

కె వాసు దర్శకత్వంలో కె మహేంద్ర, టి వెంకటేశ్వర్లు నిర్మించే వర్ణ చిత్రానికి నవంబర్ 16 న షూటింగ్ ప్రారంభింపబడింది చిరంజీవి, గిరిబాబు, ప్రసాద్ బాబు, రావికొండలరావు, హరిబాబు, జగ్గారావు, సిలోన్ మనోహర్, నవకాంత్, కవిత, సుభాషిణి, జయమాలిని, ఒక విశిష్టమైన పాత్రలో నూతన్ ప్రసాద్ పాల్గొంటున్నారు జంధ్యాల సంభాషణల కర్త. సత్యం స్వరకల్పనలో వేటూరి, గోపి, ఆరుద్ర, సీటూరి గీతాలు రాశారు. ★

ఆలు—మగలు హిందీ (జుదాయి) సెట్స్‌మీద నిర్మాత సుబ్బారావు, జితేంద్ర, రేఖా, టి. రామారావు



## కొత్త మొక్కలకై అన్వేషణ!!

# అన్ని మొక్కలూ కలిపి వంద రకాలే!

తరచు కరువు కాటకాలకు గురౌతూవుండే ఉష్ణమండల దేశాలలో కొత్తరకం పంటలు పండించటానికి జరుపుతున్న పరిశోధనలు విజయవంతమౌతున్నాయని ఈ శాస్త్రజ్ఞులు వెల్లడించారు

ఉష్ణ దేశాలలో ఇప్పటికీ సేద్యం చేయని భూములు కోటానుకోట్ల ఎకరాలు వున్నాయి. 1978 లో నేషనల్ రీసర్చి కౌన్సిల్ ప్రచురించిన ఒక నివేదికలో ప్రముఖ అమెరికన్ వ్యవసాయ శాస్త్రవేత్త రాజర్‌రెవెల్ కొన్ని ఆసక్తికరమైన విషయాలు వెల్లడించారు

భూమిపై కోటానుకోట్ల చెట్లు వున్నప్పటికీ ప్రపంచంలో చెట్లు, మొక్కలుగాని 100 రకాలు మాత్రమే. ఈ నూరు రకాలలో 35 రకాలు మాత్రమే 95 శాతం దాకా జనులకు అవసరమైన కాలరీలను, ప్రొటీన్లను సమకూర్చుతున్నాయి ఆహారానికి పనికివచ్చే కొత్తరకాల మొక్కలను, చెట్లను గుర్తించ వలసిందిగా ఈ వ్యవసాయ శాస్త్రజ్ఞులకు నిర్దేశించబడింది

ఈ కృషి ఫలితంగా 400 దాకా కొత్త మొక్కలను గుర్తించారు వీటిలో అడవి మొక్కలు కూడా వున్నాయి వీటి నుంచి జనులు తినటానికి వీలుగా వుండేవి, పోషక పదార్థాలు గలవీ — 36 దాకా వున్నట్లు నిర్ణయించారు. ఈ మొక్కలలో కొన్ని కాయ ధాన్యపు మొక్కల వలె వాటికి కావలసిన సత్తువను అవే సమకూర్చుకొనగలవు. వీటి వేళ్ళలో నత్రజని అధికంగా వుంటుంది మరి కొన్ని మొక్కలు స్వల్పకాలంలో అధిక పంటనిచ్చేవి

## కొత్త రకం చిక్కుడు

ఈ 36 మొక్కలలో పీచ్‌పామ్, కోకోయమ్, వున్నాయి మరొక "వింగ్డ్ బీన్ లేక ఫ్లయింగ్ బీన్" అనే ఈ మొక్క నాలుగు రెక్కలతో మొలుస్తుంది ప్రస్తుతం ఈ పంటను న్యూగినీలోనూ, ఆగ్నేయాసియా దేశాలలోనూ పండిస్తున్నారు. ఇది నాటిన తరువాత రెండున్నర మాసాలలో తినటానికి వీలైన పచ్చని కాయలు పుడతాయి మరి నాలుగు మాసాలలో ఈ కాయలలోని విత్తనాలు ముదిరి కోతకు వస్తాయి ఈ చిక్కుడు విత్తనాలు — మొక్కజొన్న పిండి కలిపి మిశ్రమ ఆహారాన్ని తయారు చేయవచ్చు ఈ చిక్కుడు గింజల నుంచి నూనె కూడా తీయవచ్చు ఈ నూనెలో ప్రొటీన్లు సమృద్ధిగా వుంటాయి ఈ మొక్క పందిరికి అల్లుకొంటుంది

ఈ 36 కొత్త మొక్కలలో ఒక ధాన్యపు మొక్క వున్నది దీని పేరు 'అమరంత్స్' కొలంబస్‌కి పూర్వ యుగంలో అమెరికన్ల ప్రధానమైన పంట 'అమరంత్స్' అని భావిస్తున్నారు రెడ్ ఇండియన్ నాగరికతను రూపుమాపదలచుకొన్న స్పానిష్ దురాక్రమణదారులు ఈ పంటను కూడా నాశనం చేశారట. 'అమరంత్స్' పంటను ఉష్ణ మండలాలలో ఈ పంటను విస్తారంగా పండించవచ్చునట !

ఈ శాస్త్రజ్ఞులు పశువుల మేతకు కొన్ని కొత్త పంటలను సిఫార్సు చేశారు వీటిలో ఒకటి బఫెలో గోర్డ్ ఈ కాయలలోని విత్తనాలు పశువుల దాణాకు బాగా పనికివస్తాయి

ప్రపంచంలో వృధాగా వున్న ఎంతో భూమిని సేద్యానికి పనికివచ్చే విధంగా అభివృద్ధిపరచగల అవకాశం వున్నదని ఈ శాస్త్రజ్ఞులు నివేదించారు ఈవిధంగా సేద్యానికి ఈ అదనపు భూమిని లాయికీగా చేయగలిగినప్పుడు — వ్యవసాయానికి ఇప్పటికంటే రెట్టింపు భూమి లభించగలదని వీరు భావిస్తున్నారు

[ - శాటర్డే రివ్యూ, మేగజైన్ సౌజన్యంతో ]

## సుదూర తీరాలు

[ 24వ పేజీ తరువాయి ]

తా...గు...తా ను" మెల్లగా మల్లిక చేయి అందుకొని ఆమె చేతోనే గ్లాసు పెదవుల కానించుకున్నాడు. గటగటా తాగేసి అలాగే సోఫాలోకి వొరిగిపోయాడు

'మల్లికా! మల్లికా... ని..న్ను... వారం.. రోజులు ఇక్కడే వుంచుకుంటాను..'' అంటూ ఆమె చేతిని అలాగే పెదవుల కానించుకొని ముద్దుపెట్టుకున్నాడు.

ఎ సి రూమ్ అయినా మల్లిక నుదుట చిరుచెమటలు పట్టాయి. అతను పూర్తిగా నిద్రలోకి జారుకున్నాడన్న నమ్మకం కలగగానే గబగబా లేచి ఆ పమికీచీర విప్పి, వసంత యిచ్చిన పాతచీర కట్టుకొని తల్లో పూలు పీకి అవతల పడేసి వేలుముడి వేసుకుంది అదురుతున్న గుండెలతో సంచీ చేతపట్టుకొని నెమ్మదిగా తలుపు తీసింది చుట్టూ పెద్ద ప్రహరీ వాచ్‌మెన్‌ను కూడా వెళ్లిపొమ్మన్నాడు కుమార్‌బాబు గేటు తాళం వేసుకొని వెళ్లిపోయాడు వాడు.

నెమ్మదిగా గేట్‌ను సమీపించి, అతిప్రయత్నం మీద గేటు ఎక్కి అవతలకి దూకింది. అప్పటికి టైమ్ పెద్దగా అవ్వలేదు. కాళ్ళు తీసుకెళ్లిన దారిని గబగబా నడుస్తూ ముందుకు నడిచింది

వసంత చెప్పినట్లే చేసింది అంతవరకూ ఇంక స్టేషన్ చేరుకోవాలి గబగబా నడుస్తున్న ఆమె దగ్గిరగా వచ్చి ఆగింది ఒక ఆటో అక్కర్లేదు పొమ్మంది. కానీ కడుపులో భయం, నీరసం అడుగులు ముందుకు పడటం కష్టంగా వుంది కాంతిమతి మనుషులు యెక్కడ వెంబడిస్తారో, కుమార్‌బాబు లేచి యెక్కడ వెంటబడతాడో అని అనుక్షణం చుట్టూ పరికిస్తూ నడుస్తూనేవుంది

మరికొంత దూరం వెళ్లిన తర్వాత ఓ రిక్షా ముసలివాడు,

"రిక్షా వేణుమా అమ్మా!" అంటూ ముందుకు వచ్చాడు

మరో మాట లేకుండా ఎక్కి కూర్చుని "సెంట్రల్ స్టేషన్" అని వూరుకుంది అంతకంటే ఎక్కువ మాట్లాడితే తనకు తమిళ్ రాదని వాడెక్కడ కనిపెడతాడోనని భయం

దీపాల వెలుగులో మెరిసిపోతున్న మద్రాసు మహానగరంవైపు చూస్తుంటే కళ్ళవెంట జలజలా నీళ్ళు రాలాయి మల్లికకు ఇంతటి వెలుగులు చిమ్ముతున్న ఈ నగరం తన జీవితంలో అంధకారాన్ని మాత్రమే మిగిల్చింది మౌనంగా ఆలోచిస్తూ కూర్చుంది మల్లి కళ్ళు అవిరామంగా వర్షిస్తున్నాయి

వసంత చెప్పినట్లు తమ వూరు వెళ్లాలంటే ధైర్యం చాలడంలేదు కానీ అంతకంటే ఎక్కడికి వెళ్లినా తను బ్రతకలేదన్న జీవిత సత్యం వసంత మాటలవల్ల బుజువైంది వసంత పారిపోవడానికి చేసిన ప్రయత్నాలూ, ఆ ప్రయత్నంలో ఆమె అనుభవించిన బాధలూ, ఒంటరి ఆడదాన్ని ఈ సమాజం ఎలా తరిమికొడుతుందో వసంత చెబుతుంటే, భయంతో వళ్ళంతా బిగుసుకుపోయినట్లైంది తిట్టినా కొట్టినా తనను కడుపులో ఎట్టుకొని కాపాడే తల్లి వుంది ఆదరించే మాష్టారున్నారు. బావ ప్రేమకు తనెలాగూ నోచుకోలేదు కనీసం అభిమానించే అండన బ్రతుకెళ్ళమారితే అంతే చాలు

రిక్షా ఆపి ఒళ్ళంతా పట్టిన చెమటను తలగుడ్డతో తుడుచుకుంటూ "వందాచ్చమ్మా స్టేషన్" అన్నాడు రిక్షావాడు

వాడి చేతిలో పదిరూపాయల నోటుంచింది

"చిల్లరిల్లెమ్మా!" అంటున్న వాడి మాటలు వినిపించుకోలేదు

స్టేషన్‌లోకి పరుగెట్టింది

టికెట్ ఎక్కడికి తీసుకోవాలి? హౌరా మెయిల్ ప్లాట్‌ఫాం మీద ఆగివుంది ఎక్కి కూర్చుంది.

అప్పుడే అటుగా వచ్చిన టి సి. తో తను

"రాజుకు పాలు అంటే ఒకప్పుడు అయిష్టం... నేను న్యూట్రామూల్ కలిపి యిచ్చినప్పట్నించి మహా యిష్టం"





# "మరిప్పుడు వాడు న్యూట్రామూల్ మొనగాడు"

పిల్లలు పాలు తాగటానికి మారాం చేస్తున్నారా? లేదు, అంటున్నారు రుచికరమైన న్యూట్రామూల్ కి దీవనలిచ్చే అసంఖ్యాకమైన తల్లులు. రుచికి రుచీ, బలానికి బలం, న్యూట్రామూల్‌లో కోకో, పాలు మాల్ట్ లతో పుష్టి వుంది—




బలే రుచి. మరి దీన్లో ప్రోటీన్లు, విటమిన్లు, ఖనిజాలూ వున్నాయి. పెరుగుతూన్న దశలోని శరీరానికి పుష్టినిచ్చేవి యివి. మహానసతో నిండిన న్యూట్రామూల్ ప్రతి కప్పూ ఎంతో పోషణని యిస్తుంది.

మార్కెట్ చేయువారు
గుజరాత్ కో-ఆపరేటివ్
మిల్క్ మార్కెటింగ్
ఫెడరేషన్ లిమిటెడ్
ఆనంద్, గుజరాత్

అమూల్
## న్యూట్రామూల్ ప్రతి కప్పు మీకు పోషణను ఇచ్చు!

daCunha GCM-16 T.L

# సుదూర తీరాలు

విజయవాడ వెళ్ళాలని టికెట్ తీసుకొనే టైమ్ లేదని చెప్పింది

అతను విజయవాడకు టికెట్ వ్రాసిచ్చాడు. వెంటనే బండి బయలుదేరింది

హాయిగా వూపిరి పీల్చుకుంది మల్లిక. "అమ్మయ్య! యింక కాంతిమతి గండం తప్పినట్లే ఎన్ని జన్మలెత్తి తను వసంత ఋణం తీర్చుకోగలదు? మట్టిలో మాణిక్యాలని యిలాంటివాళ్ళను గురించే అంటారు పరిస్థితులకు బానిసగా మారినా ఓ విశిష్టమైన వ్యక్తి వసంత. స్నేహమయి"

అసలు సమస్య యిప్పుడు ప్రారంభమవుతుంది వూరివాళ్ళకు తను ముఖం ఎలా చూపించాలి? బ్రతుకులో మోసపోయి, స్వల్ప వ్యవధిలో వైధవ్యాన్నికూడా కొనుక్కొచ్చుకున్న తనను చూసి అమ్మ గుండెలు పగిలేలా ఏడవదూ? బావ బాధ చూసి తను భరించగలదా? మళ్ళీ ఆలోచనలు, ఆలోచనలు వాటికి అంతంలేదు. మల్లిక మనసుకు శాంతిలేదు విజయవాడ చేరేవరకూ అవే తెగని ఆలోచనలు కృష్ణాబ్యారేజ్ దాటుతుంటే కళ్ళు మూసుకొని అందులోకి దూకేద్దామా అనిపించింది కానీ అంతలోనే ఒక్కసారి బావను చూసి క్షమాపణ కోరుకోవాలి తన తొందరపాటుకు తగిన శిక్ష లభించిందని అతనికి తెలియజెప్పాలి బావకు దగ్గిరలో వుంటూ, అతనికి దూరంగా వుండటంకంటే పెద్ద శిక్ష యింక తనకేముంటుంది? బ్రతుకు దుర్భరమనిపిస్తే... తమ వూళ్ళోనూ వుంది కృష్ణమ్మ ఓ నిర్ణయానికి వచ్చిన మల్లిక బండి దిగింది.

బస్టాండ్‌కు చేరుకుని తమ వూరుకు బయలుదేరడానికి సిద్ధంగా వున్న ఫస్ట్ బస్ ఎక్కేసి, తలనిండుగా ముసుగు కప్పుకొని కూర్చుంది ముందు ఆలోచనతో వసంత ఆ డబ్బే యివ్వకపోతే, తనింత దూరం ఎలా ప్రయాణం చేయగలిగేదీ? అడుగడుగునా వసంత సహాయం గుర్తొచ్చి కళ్ళు చెమరుస్తున్నాయి

నెమ్మదిగా కనుకొనల్లోనుంచీ చూసింది తమ వూరివాళ్ళెవరైనా కనబడతారేమోనని అప్పటికే పరీక్షగా చూస్తున్న పరమేశం కళ్ళలో పడింది మల్లి వంకరగా ఓ నవ్వు నవ్వి వూరుకున్నాడు వెంటనే తల తిప్పేసుకుంది మల్లి "తన బ్రతుకింత సర్వనాశనం కావడానికి అసలు కారకుడే కళ్ళముందు ప్రత్యక్షమయ్యేసరికి వాడిని గొంతు నులిమి చంపేయాలన్నంత ఆవేశమొచ్చింది కానీ, తను తమ వూరు వెళుతోంది అక్కడ అందరితో మంచిగా వుండక తప్పదు అనవసర విరోధాలవల్ల తనకు ఒరిగేదేముంది?" తల వంచుకొని కూర్చుంది మల్లి

బస్సు విజయవాడ దాటి పరుగులు తీస్తోంది తమ వూరికి ముందు స్టాపింగ్‌లోనే దిగిపోయాడు పరమేశం నిజానికి అప్పుడు అక్కడ దిగాలనిలేదు కానీ క్రితం రోజే తను విజయవాడ వచ్చాడు మధ్యాహ్నం బ్యాంక్ కెళ్ళి డబ్బు తీసుకొని, అలాగే వస్తూ ప్రక్క వూరు మున్సబు కిచ్చి రాత్రికే రమ్మని చెప్పాడు తండ్రి. కానీ విజయవాడ వెళ్ళి తీరా సినిమా చూడకుండా రావడమంటే అది పరమేశంవల్ల సాధ్యమయ్యే పని కాదు అందుకే డబ్బు తీసుకొని ఫస్ట్ షో, సెకెండ్ షో రెండూ చూసి కాసేపు ఓ ఫ్రెండ్ రూమ్‌లో గడిపి తెల్లవారుఝామున ఫస్ట్ బస్సుకు వూరికి బయలుదేరాడు మల్లి ఒంటరిగా కనిపించింది, కూడావెళ్ళి వూళ్ళో దిగాకైనా పలకరిద్దామనుకుంటే ఆ డబ్బు చాలా అర్జెంట్‌గా అందజేయమని చెప్పాడు తండ్రి ఈ పూటైనా యివ్వకుండా, తిరిగి యింటికి వెళితే, తాట వొలుస్తాడు తండ్రి అందుకే ఆ డబ్బు మున్సబు రామయ్యగారికందజేసి వెంటనే ఏ బస్సు వుంటే ఆ బస్సుకు వూరు వచ్చేయవచ్చులెమ్మనుకొని దిగాడు మల్లి ఎక్కడికి పోతుంది? మనూరేకదా! దొరక్క పోతుందా ఒంటరిగా ఏదో ఒకరోజు, అనుకుని వెళ్ళిపోయాడు

పరమేశం దిగిపోవటం చూసి తేలిగ్గా గాలి పీల్చుకుంది మల్లి చిరుచీకట్లో బస్టాండు నుంచి వూరు వరకూ పొలాల్లోపడి ఒంటరిగా నడవాలంటే భయంలేదు కానీ, పరమేశం వున్నాడంటేనే భయంగా వుంది అతడు దిగిపోవడంతో సగం బరువు దించినట్లైంది.

ఊళ్ళో దిగిన మల్లికి మనసులో గుబులు గుబులుగా వుంది తను పుట్టిపెరిగిన వూరే

ఎంతో పరాయిగా చూసేరాడనట్లుగా అనిపించింది ఒక్కో అడుగే తడబడుతూ యింటివైపు వేసింది అప్పటికే లేచి పాలు పితుకుతున్న చప్పుళ్ళు, వాకిళ్ళూడుస్తున్న చప్పుళ్ళు అవుతున్నాయి తల వంచుకొని పవిట నిండుగా కప్పుకొని వెళుతున్న మల్లిక వైపు ఎవరాని కుతూహలంగా చూశాయి కొన్ని కళ్ళు గబగబా తమ యింటి ముందుకు వెళ్ళి పడింది, మల్లి వాకిట్లో ఓ అయిదు నిముషాలు నిస్త్రాణగా అలాగే కూర్చుంది. ఎక్కడలేని నీరసమూ ఆవహించింది శరీరాన్ని. లోపలి నుంచి ఏ అలికిడిలేదు అమ్మ లేచినట్లు లేదింకా. అలాగే కూర్చొని మెల్లగా తలుపు తడుతోంది మల్లి ప్రక్క వాటా తలుపు తెరచుకుంది

అడుగులో అడుగులేసుకుంటూ మెల్లగా నడిచివచ్చారు దశరథరామయ్యగారు "ఎవరూ" అంటూ.

రయ్యిన వెళ్ళి ఆయన పాదాన్ని ముట్టేసి బావురుమంది మల్లి.

"అమ్మా! మల్లీ! వచ్చావా తల్లీ! ఏడవకు" అంటూ మాష్టారు ఓదారుస్తుండగానే చుట్టుప్రక్కల రెండు మూడిళ్ళ వాళ్ళు పోగయ్యారు.

"వచ్చావు, తల్లీ! యింకెవరున్నారని వచ్చావు నెలన్నా కాకముందే వదిలేశాడేం లేపుకుపోయినోడు సిగ్గులేకపోతేసరి" అని తలా ఒకరీతిగా నోటికొచ్చినట్లు తిడుతుంటే వసుమతి నోరుతెరచి తనను ఆమెలో చేర్చుకోదెందు కనిపించింది మల్లికి.

మాష్టారు మృదువుగా వాళ్లను మందలించారు.

"వెళ్లండి, తర్వాత మాట్లాడవచ్చు వెళ్లండమ్మా దయచేసి" అని చేతులెత్తి నమస్కరిస్తున్న మాష్టారిని చూసి,

"అయ్యో రామా! మాకు నమస్కారం పెడతారెందుకూ? మహాత్ములు, కన్నతల్లిని మింగింది చాలక ఇంకెవర్ని మింగాలని వచ్చిందో!" అంటూ అసలు విషయం బయటపడేసి పోయిందో పుణ్యాత్మురాలు

"అమ్మపోయిందా? తననీ ప్రపంచంలో దుపులో పెట్టుకొని కాపాడుతుందనుకున్న ఒకే ఒక వ్యక్తి, తను చేసిన పనికి ప్రాణాలు పోగొట్టు కుందా భగవంతుడా నేనెందుకింకా బ్రతికున్నాను." హఠాత్తుగా తెలిసిన ఆ నిజాన్ని తట్టుకునే పరిస్థితుల్లోలేని మల్లి,

"అమ్మా!" అంటూ ఒక్కకేక గావుకేక వేసి పడిపోయింది

అక్కడ వున్నవాళ్ళందరి పేగుల్నీ కదిల్చివేసిందా కేక

ఆతృతగా మాష్టారు మల్లిని ఎత్తుతుంటే మరో యువకుడు వచ్చి సాయంచేశాడు ఇద్దరూ కలసి వరండాలోకి చేర్చారు

మరో నాలుగు రోజుల వరకూ మూసినకన్ను తెరవకుండా పడి వుండిపోయింది మల్లి

ముక్కుకుంటూ మూల్గుకుంటూ శాస్త్రులు గారిచ్చే మందులు మల్లిమీద పనిచేయడంలేదు. ఆ పరిస్థితిలో మాధవ్‌ను రమ్మనమని టెలిగ్రాం యిద్దామనిపించినా, అంతక్రితం రోజే వచ్చి వెళ్ళడంవల్ల అతను ఖంగారుపడతాడనీ, పైగా మల్లి కూడా మాధవ్‌ను కొన్ని రోజులు చూడకుండావుంటేనే మంచిదనీ అనిపించడంవల్ల అతన్ని పిలిపించలేకపోయారు మాష్టారు

ప్రక్కింటి రమణను బ్రతిమలాడి సైకిలేసు కెళ్ళి వారానికోసారి ఆ వూరు వచ్చే డాక్టర్ని పిలుచుకురమ్మని ప్రక్క వూరు పంపించారు డాక్టర్ వచ్చి పరీక్షించి "ఇబ్బేమీలేదు కొన్ని రోజులుగా సరైన ఆహారం నిద్రా లేకపోవడంవల్ల ఎనిమిక్‌గా తయారయింది పైగా యిప్పుడీ అమ్మాయి గర్భవతి చాలా జాగ్రత్తగా చూసు కోవాలి. ఈ టానిక్స్, టాబెలెట్స్ తెప్పించి వాడండి. పాలూ పళ్ళూ సాధ్యమైనంత ఎక్కువగా వాడితే మంచిది." అంటూ వెళ్ళిపోయాడు

వూరంతా నోటిమీద వేళ్ళు వేసుకొంది ఎవడితోనో లేచిపోయి గర్భం తెచ్చుకొని, ఎంత నిర్భయంగా వూరు చేరింది. యిలాంటివాళ్ళుంటే వూరే పాడైపోతుంది. అది ఈ వూళ్ళో వుండటానికి వీల్లేదు వీల్లేదంటే వీల్లేదని పంచాయతీలో ఏకగ్రీవంగా తేల్చిపారేశాడు మున్సబు

"వెళ్ళిపోయిందనుకుంటే ఈ జ్యేష్ఠ మళ్ళీ దాపురించింది దాన్ని ఎదురుగా వుంచుకొని మాధవ్ మరో పిల్లను పెళ్ళి చేసుకుంటాడా? చేసుకున్నా కాపురం చేస్తాడా! అందుకే అది ఈ వూళ్ళో వుండటానికి వీల్లేదు" అనుకున్నాడు మున్సబు

ఎవరికివాళ్ళే తీర్మానాలైతే చేశారుగానీ అది మాష్టారితో చెప్పడానికే ఎలాగో వుంది పైగా మల్లి యింకా సరిగ్గా కోలుకోలేదు ఇప్పుడిప్పుడే లేవడానికి ప్రయత్నిస్తోంది మాష్టారు సాధ్యమైనన్నిరీతుల మల్లికి ధైర్యం నూరిపోస్తున్నారు అయినా ప్రతిక్షణం కళ్ళలో మంచి ఏకధారగా కురుస్తూనేవుంది కన్నీరు మల్లిని చూస్తుంటే కడుపు తరుక్కు పోతోంది మాష్టారికి

"ఎలా వుండే పిల్ల ఎలా అయిపోయింది? చైతన్యానికి మారుపేరులా, సజీవ స్రవంతిలా, ఎప్పుడూ కిలకిలా నవ్వుతూ గంతులేస్తూ, మొన్న మొన్నటివరకూ తన ముందు రాగాలాలపిస్తున్నట్లే వున్న మల్లిలో, యింత కొద్ది వ్యవధిలో యింతటి మార్పెలా సాధ్యమైందని? పూర్ణ, అదృష్టవంతురాలు ముందే దాటిపోయింది మల్లినీ పరిస్థితుల్లో చూసే దురవస్థనుంచి తప్పుకుంది" అనుకుంటూ కళ్ళు తుడుచుకునేవారు మాష్టారు వూళ్ళో జరుగుతున్న కుట్ర తెలుస్తూనేవుంది అంతటి పరిస్థితే వస్తే ఏం చేయాలి? వూరందరినీ ఎదిరించి తను నిలబడగలడా? ఆలోచనలతో ఉక్కిరిబిక్కిరౌతున్న మాష్టారు,

"బాబాయ్! మున్సబుగారేంటో ఉత్తరం పంపించారు" అంటూ వచ్చిన రమణ చేతుల్లోనుంచి లెటర్ అందుకున్నారు

అందులో సారాంశం యింతక్రితం ఆయన వూహించిందే "మల్లి ఆ వూళ్ళో వుండటానికి వీల్లేదు. కనుక మల్లిని వెంటనే వెళ్ళగొట్ట వలసింద"ని వ్రాశారు "మల్లి జీవితం మిగతా కన్నెపిల్లలందరికీ గుణపాఠం కావాలంటే మల్లికా శిక్ష వేయక తప్పదు ఇక వారంలోపు మల్లిని పంపించేయాలి అలా కానిపక్షంలో పంచాయితీకి వ్యతిరేకంగా వ్యవహరించిన నేరానికి బాధ్యత వహించవలసివస్తుంది

పెద్దలు మిమ్మల్ని బాధపెట్టడం ఇష్టంలేక ఒక సదుపాయం కలిగిస్తున్నాము అదీ మల్లి మీద సానుభూతితో కాదు మీమీద గౌరవంతో. తను కావాలంటే మాలపల్లిలో వుండవచ్చు అదీ వాళ్ళు ఒప్పుకుంటే. వాళ్ళూ వెలేస్తే దానికి మేమేమీ చేయలేం"

గ్రామ పంచాయితీ

మున్సబు

అక్కడే కూర్చునివున్న మల్లి ఉత్తరం తన చేతుల్లోకి తీసుకొని చూసింది చదివింది కన్నీళ్ళు తుడుచుకుంటున్న మాష్టారి వైపు చూసింది

"మాష్టారూ! బాధపడకండి మన ఊరు పెద్దలు చాలా మంచివాళ్ళు కనుకే యింత చిన్న శిక్షతో పోనిచ్చారు మాలపెద్ద లక్ష్మయ్యను పిలిపించండి. వాళ్ళకిష్టమైతే వాళ్ళతో వుంటాను, లేదంటే.. వెళ్ళిపోతాను" అంటున్న మల్లి వైపు ఆర్ద్రంగా చూస్తూ,

"ఎక్కడికమ్మా? నీ వూరివాళ్ళ మంచితనాన్ని పొగుడుతున్నావా మల్లీ! తల్లీ పోయి, అనాథై, అసహాయ పరిస్థితుల్లో వున్న ఒక ఆడపిల్ల మీద పిడికెడు సానుభూతి కురిపించలేని, నీ ఊరి పెద్దమనుషుల గొప్పతనాన్ని చూసి మురిసిపోతున్నావా? నువ్వెక్కడికి వెళతావు మల్లీ! నేనింకా బ్రతికేవున్నానమ్మా! పద యిద్దరం కలసి విజయవాడ వెళ్లిపోదాం అప్పుడే గొడవలూ వుండవు మాధవ్ కూడా సంతోషిస్తాడు"

"లేదు మాష్టారూ! విజయవాడ నాను వాళ్ళు ఒప్పుకుంటే మాలగూడెంలో వుంటాను లేదా ఎక్కడైనా దూరంగా మాధవ్ బావ మీద నా నీడైనా పడనంత దూరంగా వెళ్లిపోతాను దయచేసి మీరీ విషయంలో నన్ను బలవంత పెట్టకండి బావ భవిష్యత్తుకు నేను ఏ రకంగానూ అడ్డురాదల్చుకోలేదు బావకు నా పాపిష్టిముఖం చూపించలేను మాష్టారూ!" అంటూ తన కాళ్ళకు చుట్టుకుపోయి హృదయవిదారకంగా ఏడుస్తున్న మల్లిని లేపి కూర్చోబెడుతూ,

"అలాగేనమ్మా! నీ యిష్టప్రకారమే చేద్దాం! ఏడవకు నేను లక్ష్మయ్య కాళ్ళు పట్టుకొనైనా అతన్ని ఒప్పిస్తాను" అంటూ తుండు నోట్లో కుక్కుకుంటూ బయటకు వెళ్లిపోయారు మాష్టారు, ఏడుపు ఆపుకునే ప్రయత్నంలో

*[ఇంకా వుంది]*

# ఎవరో రావాలి

ఎటు పయనిస్తోంది దేశం ?
ఏ ప్రళయాగ్నికి ఆహుతవుతుందో దేశం
గాంధీజీ కలలుగన్న రామరాజ్యమిదేనా ?
చాచాజీ చిరకాల వాంఛ, శాంతి రాజ్యమిదేనా ?
దేశాన్ని రాజకీయాస్త్రాలతో వధిస్తున్న ఈ ఘనులు
భగత్, ఆజాద్‌ల రుధిరంతో తడిసిన ధరణిలో
ద్వేషం విషమై వాహినులై పారుతున్నది.
గుప్తుల స్వర్ణయుగం చవిచూచిన పృధ్విలో
ధనమంతా కొందరి హస్తాల్లో గుప్తమైపోయింది
ధర్మప్రభువు అశోకుడు రాజ్యమేలిన అవనిలో
నిరుద్యోగం, అరాచకం పిచ్చిమొక్కలు మొలిచినాయి
ఈ దేశంలో మనగలుగుతుందా స్వతంత్రం
ఎక్కడ చూసినా విహరిస్తోంది, రాజకీయ కుతంత్రం
అందుకే, ఏ నెపోలియనో, హిట్లరో జన్మించి,
విప్లవాగ్ని రగిలించి, దేశాన్ని మండించాలి.
లేదా, ఏ గాంధీయో, గౌతముడో దిగివచ్చి,
శాంతిధారలు కురిపించి, క్రాంతి మార్గాన నడిపించాలి
ఎవరో రావాలి, భరతమాతకు పునర్జీవితం ప్రసాదించాలి

యం. నాగేందర్

# ముడివడిన జీవితాలు

[ 21వ పేజీ తరువాయి ]

అమ్మ మొహం చిట్లించి అక్కడినుండి వెళ్లిపోయింది నేను చాలకాలం ఉత్తరం చదువుకున్నాను. మొదటి పేజీలో నన్ను క్షమించమని వేడుకోవడంతోనే సరిపోయింది నేననుకున్నట్లుగానే వాళ్ల నాన్నగారి ముందు నోరు విప్పడానికి భయంట అసలు విషయం ఆఖరున వ్రాసింది, "మీరు తండ్రి కాబోతున్నారు ఈ శుభవార్త ముందుగా మీకే తెలియజేసాను మీరు నన్ను క్షమించి యిక్కడికి వస్తే యింట్లో చెప్తాను. లేకపోతే ." ఏమిటి చేస్తుందో వ్రాయలేదు. ఉత్తరం మడతపెడుతూంటే అమ్మ పాలు పట్టుకొచ్చింది

"అమ్మా, మీ కోడలు నెల తప్పిందిట." సంతోషాన్ని పంచుకోడానికి ఎదురుగా అమ్మే కనిపించింది

జానకివేపు చూశాను. ఆమె బెదురు చూపులు చూస్తుందిగాని నాకే లోటులేదని చెప్పదేం? ఆమె కసలు వాళ్ల మాట లర్థమవుతున్నాయా లేక ఆమె కూడా ... మౌనం వహించిన ఆమెపై పట్టలేని కోపం వచ్చింది

జానకి తప్పలేదేమో ... మామూలుగానే ఆమె జవాబు చెప్పగా వినలేదు, అటువంటిది వాళ్ల నాన్నగారు గర్జిస్తుంటే, అమ్మ అరుస్తూంటే ఏమంటుంది ? నేనే అనుకుంటే నాకన్నా ముభావంగా వుండేది. ఆమెలో ఉత్సాహం చూసింది కేవలం యింటికి పంట కోతల వేళంటూ అమ్మ వెళ్లిన రెండు నెలలే. సరదాగా మనసువిప్పి మాట్లాడుతూంటే నేను కూడా ఆమెను అందమైన బొమ్మగా గాక మనిషిగా చూడటం, నిర్మలమైన మనస్సుతో నన్నె ప్రేమిస్తున్నారని తెలుసుకున్నాక ఆమెను ప్రేమించడం అప్పుడే నేర్చుకొన్నాను. ఆమెనింకా పూర్తిగా అర్థం చేసుకోకుండానే అమ్మ రావడం, వారం తిరక్కుండా ఈ గొడవ, ఆమె వెళ్లిపోవడం జరిగిపోయాయి

బాగా రాత్రయాక తప్పనిసరిగా యిల్లు చేరేను భోజనమయి గదిలో కెళ్తూంటే అమ్మ ఒక కవరు తెచ్చిచ్చి అంది, "మరిచిపోయాను, ఏకేదో ఉత్తరం వచ్చింది "

కవరు మీద వ్రాసినవారి పేరు చూడగానే ఆశ్చర్యంగా విప్పి గబగబా చదవసాగాను

"ఎక్కడినుండిరా, వెంకూ ?"

"మీ కోడలు వ్రాసింది "

"జానకా ? ఏమని ?"

"చదవందే ఎలాగ తెలుస్తుంది ?"

నా మాటల్లో విసుగు ధ్వనించిందేమో,

"జానకి రాసిందా? మీ మామగారు రాయలేదేమి ?"

"జానకింకా ఎవరికి చెప్పలేదుట."

"అదేమిటి ?" అని ఏవో లెక్కలు కట్టి అడిగింది, "వెళ్ళి ఎన్నాళ్ళైంది ?"

"నెల దాటిందేమో," అన్నాను అమ్మ ఉద్దేశం గ్రహించడానికి ప్రయత్నిస్తూ.

"నేనప్పుడే రెండు మూడు నెలలైపోయిం దనుకున్నాను. పోనీలే సంతోషం, వెంకూ," అంటూ వెళ్ళిపోయింది

అమ్మ మాటల్లో భావం మనస్సుని కలవర పెట్టింది అమ్మకే అనుమానమొచ్చినప్పుడు, నన్ను యింపొటెంటన్న మనిషేమంటారు ? అందుకే జానకి నన్ను రమ్మందా ? కోపంలో కూతురి శీలాన్నే శంకిస్తున్నారని మరిచిపోతా రనుకుందా ? నాకు మాత్రం సంశయం ఏ కోశానా లేదు. ఆమె వెళ్ళిన మర్నాడే ఎందుకేనా మంచిదని డాక్టరుచేత పరీక్ష చేయించుకున్నాను పైగా ఆమె వ్రాసిన లెక్కప్రకారం పున్నమినాటి రాత్రి.. అమ్మ రెండు రోజుల కొస్తుందనగా... ఆ రోజు ఎర్రఅంచు తెల్లచీరలో జానకి మల్లెపువ్వులాగ .

కాని నన్నవమానించిన మామగారింటి కెలాగెళ్తాను ? మళ్ళీ ఇన్‌సల్ట్ చేస్తే ? జానకి మళ్ళీ నోరు విప్పకపోతే ? నేను సందిగ్ధంలో పడ్డాను.

ఉత్తరానికి నా వద్దనుండి జవాబు రాకపోతే ఏ అఘాయిత్యమేనా తలబెడుతుందేమోనన్న ఆలోచన రావడం, వెంటనే రమ్మని మామగారి నుండి టెలిగ్రాం రావడం ఒక్క రోజే జరిగేయి నేననుకున్నంతా అయింది. ఎక్కడనుండి జానకి అంత నల్లమందు సంపాదించిందో? వెంటనే వాళ్ళమ్మగారు చూసేరు కాబట్టి సరిపోయింది నేను వెళ్ళిన్నాడే ఆసుపత్రినుండి తీసుకొచ్చారు

"నాయనా, అమ్మాయి తెలివొచ్చిన దగ్గర నుండి నిన్నే పలవరిస్తున్నాది," జానకి మంచం దగ్గిర కూర్చున్న వాళ్ళమ్మగారు అన్నారు, "పంతాలకిపోయి అమ్మాయి మనసులో ఏముందో తెలుసుకోలేదీయన పోనీ, అదైనా చెప్పొద్దూ ? ఇప్పుడు డాక్టరంటున్నాడు ."

ఆమె చెప్పటానికి సంశయిస్తున్న విషయ మేమిటో గ్రహించిన నేను మెల్లగా అన్నాను, "నాకు తెలుసు జానకి వ్రాసింది."

దూరంగా తలొంచుకు నిలబడ్డ మామగారు గబగబా వచ్చి నా చేతులు పట్టుకొని అన్నారు, "నన్ను క్షమించు, వెంకటేశం. కోపంలో కూతురి జీవితం నాశనం చేస్తున్నానని తెలియలేదు అమ్మాయికి మూడవనెల..."

అప్పుడే జానకి కళ్ళు విప్పింది. నేను మంచం దగ్గిరగా వెళ్లి కళ్ళతోనే అడిగేను, 'ఆలస్యంగా వచ్చినందుకు నన్ను క్షమించవూ ?' ఆమె జవాబుగా చిన్నగా నవ్వింది. "మనం జీవితం కొత్తగా ప్రారంభించుదాము." నేను అస్పష్టంగా గొణుగుతూంటే స్కూలు నుండి ఆఖరి బావమరిది వచ్చేడు, "భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిందిట – స్కూల్లో లడ్డూలు పంచి పెట్టారం"టూ

# వారఫలం

**14-12-1979 శుక్రవారం మొదలు**
**20-12-1979 గురువారం వరకు**

**మేషం :** మీ ప్రయత్నాలు ఈ వారం ఫలిస్తాయి. వ్యాపారానుకూలత చెప్పవచ్చు. ముద్రణ, పత్రికా ప్రకటనలో సర్వానుకూలం కాని అనుకోకుండా వ్యయం కనిపిస్తుంది. వృథా ఖర్చులు మీద పడే పరిస్థితులుంటాయి. వారారంభంలో ముఖ్య విషయాలను గూర్చి, వ్యాపార విషయాలను గూర్చి ఉత్తర ప్రత్యుత్తరాలుంటాయి. స్త్రీలకు: అధికంగా లాభదాయకమైన సంఘటనలుంటాయి.



**వృషభం :** ఈ వారం మీ ఆదాయానికన్నా వ్యయం అధికం. భూసంబంధంగా చిక్కులుండే వారం. పరిష్కారం కావాలని తాపత్రయపడ్డా గాని అది ఒక రేవుకు వచ్చే మార్గం లేదు. ఏ రీతిగా చూచినా కార్యాలకు అంతరాయాలే అధికం. వ్యాపారస్తులు జాగరూకతతో ఉండతగిన వారం. ఉద్యోగంలో పొరపాట్లు దొర్లకుండ చూచుకోవాలి. కృషిమాత్రం ఏ మాత్రం మానుకొనుట తగదు. స్త్రీలకు: సునాయాసంగా లలితకళా వ్యాసంగంలో పేరు పెరుగుతుంది.

**మిధునం :** మీ స్వకార్యాచరణకన్నా పరులకు సహాయం చేయటంలోనే వారం వ్యయిస్తారు. రాబడిని మించిన వ్యయం కూడా అధికమే. అనుకోకుండా వ్యయభారం మోయవలసి వస్తుంది. ముఖ్య బంధువులు ఇంటికి రావటం ముఖ్యసమస్యలను గూర్చి చర్చించటం జరుగుతుంది. స్త్రీలు వ్యాపార సంస్థలలో పని చేసే వారయితే లాభదాయకమైన వారం.

**కర్కాటకం :** నూతన కార్యక్రమాలు ప్రారంభించుటకు అనుకూల వారం. కొందరు జాయింటు వ్యాపారం తలపెట్టి, అధిక లాభాలు గడింపనున్నారు. పుస్తక విక్రేతలకు, వ్రాత పనుల మూలాన జీవించే వారికి, లలితకళాభ్యాసం చేత జీవనం చేసేవారికి యోగదాయకమైన వారం. ధనం ఆశింపతగిన వారం. స్త్రీలకు: ముఖ్య కార్యాచరణం : లాభదాయకమైన వారం.

**సింహం :** మీ ఆరోగ్య విషయంలో జాగరూకత అవసరం. మీ అభివృద్ధికి అంతరాయం కలిగించే వారుంటే వారిపట్ల జాగ్రత్తగా మెలగవలసి ఉంటుంది. మిత్రులతో సన్నిహితులతో సంభాషించే సమయంలో, ఏమరుపాటు తగదు. మీ తాలూకు వస్తువులు పోవచ్చు. వారం ద్వితీయ భాగంలో అనుకూల పరిస్థితులుంటాయి. మీ భక్తి రాణించే వారం. స్త్రీలకు : సర్వవిధాలా అనుకూలం. ద్రవ్యాదాయముంటుంది. కృషి రాణిస్తుంది.

**కన్య :** గోచార విగ్రహం మీ లగ్నస్థితుడు గదా! 'శని జన్మని' అన్న న్యాయాన ఆరోగ్య లోపం కనిపించవచ్చు. అందుకు దోహదం చేసే గ్రహస్థితి కూడ ఉండగలదు. ఉద్యోగ వ్యవహారాలలో ఎంత శ్రమించితే అంత మంచిది. ఎంత శాంతయుతంగా ఉంటే అంత లాభదాయకం. ద్రవ్యాదాయం కాకున్నా మానసిక శాంతి ఉంటుంది. స్త్రీలకు: ఆరోగ్య విషయం చూచుకోవాలి. అనవసరాలకు ఇబ్బంది లేదు.

**తుల :** వృత్తి విద్యలనభ్యసించే వారికి, వైద్య వృత్తిలో ప్రవీణ్యం గల వారికి శస్త్ర చికిత్సయందు అలవాటు కలవారికి రాశికి ఏకాదశంలోని గ్రహానుకూలత వల్ల అనుకూలత గలదు. అభివృద్ధి దాయకమైన అవకాశాలు. కళావైపుణ్యం గల వారికి చలన చిత్ర రంగానుభవం గలవారికి చెప్పవచ్చు. స్త్రీలకు: ఉద్యోగాభివృద్ధి, వృత్తియందు ఆశించిన సత్ఫలితాలు సంభవం.

**వృశ్చికం :** మీరు ప్రయాణం చేయవలసివస్తుంది. లేదా మీ బంధువులు ఇంటికి రావటం సంభవం. పుత్రికా శుభ కార్య ప్రస్తావన లుండగలవు. ఉద్యోగములో అనుకూలతకు శాంతికి ఏ మాత్రం ఇబ్బంది రాదు. మనస్సులో వేధించే ఒకానొక విషయం ఈ వారం పరిష్కారం కాగలదు. రాజకీయ రంగానుభవం గల వారికి, అనుకూల వాతావరణం గలదు. ధనాదాయమున్నది. స్త్రీలకు: ప్రత్యేకంగా అధిక లాభాలాశించే మార్గం లేదు.

**ధనుస్సు :** మీ పుత్ర సంతానాన్ని గూర్చి మీ వ్యాపారాన్ని గూర్చి చాలమందికి జాయింటు వ్యాపార విషయంలో ఉద్యోగం చేసే వారైతే ప్రమోషన్, ప్రగతి, ఇత్యాది సత్ఫలితాలుండగలవు. వివాహాది శుభకార్యాలను గూర్చి విపులంగా చర్చించటం కూడా జరుగుతుంది. వ్యాపార రీత్యా మీకు అనుకూలత గలదనుటలో గ్రహానుకూలత గలదు గదా! స్త్రీలకు: చాలమందికి ఉద్యోగ వృత్తులలో ఆదాయం ఆనందం లాభం విజయం గలదంటాను.

**మకరం :** శుక్ర శనివారాలు మీకు బాగా ఉపయోగించవచ్చు. మీరు ప్రయాణం చిన్నదో పెద్దదో చేయవలసి వస్తుంది. ఏ విధంగానైనా మీకు ధనాదాయం కలదనుటలో ఆక్షేపణలేదు. చలనచిత్ర రంగానుభవం. బరీవ్యాపారం చేసేవారికి ఏ అంతరాయాలుండవు. స్త్రీలకు ఒక్క ఆరోగ్య విషయంలో తప్ప తక్కిన విషయాలలో ఏమాత్రం లోటురాదు.

**కుంభం :** మీ ముఖ్య బంధువులో, ఆత్మీయులో, దూర దేశాన్నుండి మిత్రులో, గృహం చేరటం సంభవం. అంతేగాక, దూరదేశాలనుండి, ఉత్తర ప్రత్యుత్తరాలు, మీ వృత్తి ఉద్యోగ వ్యాపారాలకు సంభవించినవి రావచ్చు. సద్గోష్ఠి సంభవం. ఆదాయం, అభివృద్ధి చెప్పదగిన వారం. వారఫలం అభివృద్ధి దాయకం. స్త్రీలకు: కళాప్రవీణ్యులకు వ్యాపారస్థులకు శుభమైన వారం.

**మీనం :** మీకు గత వారానికన్నా, తలంచిన కార్యానుకూలత గలదు. ఊహించి మీరు సాధించే ప్రతి పనీ కలసి వస్తుంది. ధనాదాయం, గౌరవం పెరగటం, తలంచిన కార్యం జయప్రదం కావటం అభివృద్ధి సంభవించటం, ఈ వార లక్షణంగా, గ్రహస్థితిగా మీరు గ్రహింపనున్నారు. స్త్రీలకు సర్వరంగాలలో సామాన్య ఫలితాలకు లోటు లేదు ఆరోగ్య లోపం రాదు.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

మిరమిట్లు గొల్పే తెలుపు
చూడగానే
అందరి నోట ఒకే మాట...



ఇది తప్పక

**డెట్**

డిటర్జెంట్
బిళ్ల వుతుకే




Shilpi DM 35A/78 Tel

తను స్టెతస్కోపు పెట్టి తీసేయబోతూంటే 'మీరు అంత తొందరగా చూసేస్తారు కాబట్టే మీకు నా జబ్బు తెలియటంలేదు కొంచెం నిదానంగా...'

'నిదానంగా ఉండవలసింది నేను కాదమ్మా నీవు' అంటూ తను బయటికి వచ్చేడు.

ఆ మాటలు లలిత ఎలా అర్థం చేసుకుందో 'సరే డాక్టర్' అంటూ కర్టెను అవతలికి వొచ్చి కుర్చీలో కూర్చుంది.

తను మాత్రలు కట్టి ఇస్తూంటే 'డాక్టర్ నిన్న మీ క్లినిక్ కట్టేయగానే ఎవరెంటి వచ్చి తలుపు కొట్టింది?'

'ఎందుకేంటి?' అన్నాడు తను.

'ఏంలేదు వొట్టినే!' అని 'ఆమె రోజూ వస్తుందా?' అంటూ తనది ఏదో పోయినట్లు దిగులుగా చూసింది.

'రోజూ వస్తుంది'

'మధ్యాహ్నమేనా, పొద్దున్న కూడానా?'

'మధ్యాహ్నమే' అని అతను అనగానే ఆమె ముఖం తిరిగి ప్రకాశంతో నిండుకుంది.

'నేను వెళ్తాను' అంటూ తన్ను తలెత్తి చూడకుండా వెళ్ళిపోయింది.

# ప్రాక్టీసు పెట్టిచూడు

(16వ పేజీ తరువాయి)

ఆమె వెళి పోయిన అరగంట కా తను నిమల చెప్పినట్లు పాంప్లెట్లు బొమ్మలు కత్తిరించేడు. అరగంట తర్వాత వొక బ్లడ్‌ప్రెషర్ కేసు వచ్చింది. వచ్చిన పేషంటు చాలా దిగులుగా నిరాశగా కనిపించేడు. అతని బ్లడ్‌ప్రెషర్ చూస్తే మరీ అంతగా లేదు.

'ఎందుకు అంత దిగులుగా ఉన్నారు?' అన్నాడు తను.

'ఏంచేయమ చెప్పండి. ఎన్నియింజక్షన్లు తీసుకున్నా ఎన్ని మందులు వాడినా యీ బ్లడ్‌ప్రెషర్ తగ్గటమే లేదు! పెద్ద సంసారం ఉన్నవాడ్ని. నాకు కాలో చెయ్యో పడిపోతే నా సంసారం ఏంగాను? అదే ప్రొద్దస్తమానం దిగులండీ.'

'ఎవరేంటి నీకు మందిస్తూంది యిన్నాళ్ళా?'

'ఆ ప్రక్క వీధిలో డాక్టరండీ. యాడాదినించీ అలా యింజక్షన్లూ చేస్తూనే ఉన్నాడు!'

తిరిగి యీసారి క్షుణ్ణంగా పరీక్షించి—

'చూడండి, మూర్తిగారూ! మీకు బ్లడ్‌ప్రెషర్ ఎక్కువలేదు కొంచెం ఉంది. మీరు మీ తిండి విషయంలో కొంచెం జాగ్రత్త తీసుకుంటే తగ్గిపోతుంది. మొదట రాత్రిపూట అన్నం విడిచేసి చపాతీలమీద కాల్చిన రొట్టెలు తినండి. పగలు తిను బండారాల్లో కొంచెం ఉప్పు తగ్గించండి. ఇలా చేస్తే మందు కూడా వాడనవసరంలేదు. వొక నెల తర్వాత కనిపిస్తే చాలును' అన్నాడు తను.

'అదేంటండీ డాక్టరుగారూ! ఇన్నాళ్ళా మందులూ యింజక్షనులూ వాడగా తగ్గంది మీరు మందులు ఆపేస్తే తగ్గిపోతుందంటారు!'

'మూర్తిగారూ— మీకుండే లక్షణాల మీ బ్లడ్‌ప్రెషర్ వంచి కాదు. మీ మానసిక ఆందోళన వంచి— మీరు మీకు జబ్బుందనే మరచిపోయి హాయిగా నవ్వేస్తూ తిరగండి.'

'ఏంటోనండీ! ఆ డాక్టరు దగ్గరకెళితే బరువు పనులు చేయకు — మాత్రలూ యింజక్షనూ శ్రద్ధగా వాడుకో— అశ్రద్ధ చేసేవా కాలూ చెయ్యీ పడిపోతుంది; పక్ష

వాతం వచ్చి అంటాడు. మీరేమో నీకు జబ్బులేదు తిని తిరిగేయ్ అంటారు. ఏవర్ని నమ్మాలో?'

'చూడండి మూర్తిగారూ! నేను రెండు మైళ్ల దూరంనించి వస్తాను యిక్కడికి. ఎందుకో తెలుసా? డబ్బు సంపాదిద్దామని! అంతేకాని ప్రొద్దుపోక వచ్చి యీ కుర్చీలో కూర్చోటంలేదు. నాకు నెల అయ్యేసరికి అద్దెలు కట్టుకోవాలి. సంసారాన్ని నడిపించాలి. వీటికంతా డబ్బు అవసరం. వొచ్చే యిద్దర్నీ నీకు మందులు అక్కరలేదు అంటూ వచ్చే డబ్బును త్రోసిపేసేంత ధనవంతుణ్ణి కాదు అయినా మీకు మందులూ ఇంజక్షన్లూ వద్దన్నానంటే కాస్త ఆలోచించండి. ఇక్కడకాదు. ఇంటికెళ్ళి ఆలోచిస్తే నేను చేసిన పని వెనుక ఉద్దేశం బోధపడుతుంది' అంటూ పేపరు చూడసాగేడు తలవొంచి. రెండు నిముషాల తర్వాత తలెత్తితే మూర్తి లేడు.

తనకు మనస్సంతా వెలావెలా అయిపోయింది మూర్తి చేసేది గవర్నమెంటులో చిన్న ఉద్యోగం. పెద్ద సంసారం. వీటికి తోడు నెలనెలకూ యాభై రూపాయల మందుల ఖర్చులు. తనే ఆ స్థితిలో ఉంటే మందులకు అలా ఖర్చు పెట్టగలడా? అయినా ఖర్చుపెడుతున్నాడంటే? మిగిలిన కనీస సంసారపు అవసరాలయినా తగ్గించుకోవాలి. లేకపోతే బల్లక్రిందనించి ఆదాయం అయినా ఉండాలి.

ఆలోచనలకి అంతరాయం కలిగిస్తూ, మధ్యవయస్కుడిలా ఉన్న వొకతను వొస్తూనే నమస్కారం అంటూ కుర్చీలో కూర్చున్నాడు. తను నోరు విప్పకముందే 'నా పేరు సత్యనారాయణ, నేను ఈ మలుపుమీదఉన్న గవర్నమెంటు స్కూల్లో టీచర్ని.'

'చెప్పండి?' అన్నాడు తను.

'ఏమీలేదు కొంచెం వేడి చేసింది.'

'అంటే?' అన్నాడు తను.

'మూత్రం కొద్దిగా మంటగా ఉంది, కొంచెం కొంచెం చీము కూడా వస్తూంది.'

'మీకు ఏమయినా...'

'అవునండీ డాక్టరుగారూ! నిన్నామొన్నా చేపలు తినేసేను. అవివేడిచేసినట్టున్నాయి!

'అలానా' అని 'లోనికి పదండి, పరీక్షించాలి' అన్నాడు.

# ధర్మపథం

## శ్రీరాముని ధర్మాసక్తి

చక్రవర్తి అయిన దశరథుడు తన సత్యవాక్య పరిపాలనకై శ్రీరాముణ్ణి వనానికి తీసుకొని వెళ్లాలని సుమంత్రునికి ఆజ్ఞ యిచ్చాడు. ప్రభువుల ఆజ్ఞ పరిపాలిస్తూ సుమంత్రుడు శ్రీరాముణ్ణి రథంపై కూర్చుండ బెట్టుకొని తీసుకొని వెళ్తున్నాడు.

తర్వాత రాముణ్ణి విడవలేని దశరథుడు మిక్కిలి దుఃఖిస్తూ, తన అసత్యవాదిత్వానికయినా, సిద్ధపడి రాముణ్ణి అయోధ్యలో ఉంచడానికే సంకల్పించాడు. కాని అప్పటికే రథం చాలా దూరం వెళ్ళిపోయి వుంటుందని, తత్తరపాటుతో మరొక రథాన్ని ఏర్పాటు చేసుకుని, సుమంత్రుని మార్గాన్ననుసరించి త్వరగా పోవాలని సారథికి ఆజ్ఞ యిచ్చాడు. కొంత సేపట్లో దశరథుడి రథం శ్రీరాముడున్న రథాన్ని సమీపించింది. "సుమంత్రా! సుమంత్రా! రథాన్ని ముందుకు పోనియ్యక వెనక్కి త్రిప్పు" అని చాలా గట్టిగా అరిచాడు. ఆ మాట సుమంత్రుడికి, రాముడికి కూడా స్పష్టంగా వినబడింది. "రామా! విన్నావా, మీ నాయనగారి మాట! రథాన్ని వెనక్కి మళ్ళించమన్నావా?" అని సుమంత్రుడు శ్రీరాముణ్ణి అడిగాడు. "రథం ముందుకు సాగిపోనీ. వెనక్కి మళ్లించవద్దు. ఆ మాట వినబడలేదనే అనుకో" అన్నాడు.

"స్పష్టంగా వినబడుతూవుంటే వినబడలేదని ఎలా అనుకొనేది? అలా అనుకోవడం మోసం కాదా?" అన్నాడు సుమంత్రుడు. "వినబడ్డాదనే అనుకో. అయినా, నీవు రథాన్ని వెనక్కు తిప్పనక్కరలేదు" అని శ్రీరాముడు గట్టిగానే అన్నాడు.

"ఆయన చెప్పినట్లు చెయ్యకపోతే ప్రభుని ఆజ్ఞ తిరస్కరించినట్లు కాదా?" అని సుమంత్రుడన్నాడు.

"సుమంత్రా! నీవు ప్రభుని ఆనతిప్రకారం నన్ను అడవికి తీసుకొని పోతున్నావు. ఆ ఆజ్ఞ నెరవేర్చడం నీకు ధర్మం. ఇప్పుడు దశరథుడు ఆజ్ఞాపిస్తున్నది చక్రవర్తిగా కాదు. కుమారుణ్ణి విడవలేక పరితాపంతో వున్న తండ్రి కోరిక యిది. ప్రభుని ఆనతి గొప్పదా? తండ్రి కోరిక గొప్పదా? ఆలోచించు. పుత్ర ప్రేమతో మా తండ్రి మనస్సు బలహీనమై పోయింది. ఆయన ప్రభువుగా తానిచ్చిన ఆజ్ఞను పూర్తిగా విస్మరించాడు. అది ధర్మ విరుద్ధం. లోకానికి ఆదర్శమైనది కానేకాదు. దుఃఖపూరిత హృదయులకు మంచి చెడ్డల విచక్షణ పూర్తిగా పోతుంది. నీవు ప్రభువు ఆనతిని నెరవేర్చాలి. కాని తండ్రి కోరికను తీర్చనక్కరలేదు" అని శ్రీరాముడు సుమంత్రునికి ధర్మాన్ని ఉపదేశించాడు.

'శ్రీరాముని రథం వెంట దశరథుని రథం వెళ్ళిందా?' అన్నది వేరే విషయం. అది యిక్కడ చర్చనీయాంశం కాదు.

శ్రీరాముని ధర్మాసక్తికే ఈ సంఘటన ఉదాహరణగా చెప్పబడినట్లు మనం గ్రహించాలి.

— బులుసు వేంకటరమణయ్య

# ప్రాక్టీసు పెట్టిచూడు

'ఆదేం అవసరం లేదండీ! ఒక పెన్సిలిన్ యింజక్షను వెయ్యండి, తగ్గిపోతుంది.'

'ట్రీట్‌మెంటు భాగానికి తర్వాతవద్దాం కాని ముందు నేను పరీక్షించాలి...' అంటూ తను మొండికేసేసరి,

'డాక్టరుగారూ! నా జబ్బు గురించి నాకు తెలియక పోవడానికి నేను చదువుకోని వాడిని కాదు. ఇరవై ఏళ్ళనించి చదువు చెబుతున్నాను— వెధవ పనులు చేసేనని అనుమానంగా వుందికదూ మీకు! నలభై అయిదో ఏట నేను కానిపని చేస్తానని అనుకున్నారా? అయినా సుఖవ్యాధులంటే నాకు తెలుసు, అవి కావండీ యివి! ఇది చేపల కూర వేడండి. దానికి ఒక్క యింజక్షను యివ్వండి... అంతే చాలండి?' అని తెస్తూ 'నేను ఆ వీధి మలుపు డాక్టరు దగ్గరకే వెళ్ళవలసింది. అతను ఏం ప్రశ్నలూ వేయకుండా తన గౌరవమూ కాపాడినవాడి గౌరవమూ కాపాడుకుంటూ వైద్యం చేసుకుపోతాడు. అక్కడ లక్ష ఎక్కువనీ పెన్సిలిన్ యింజక్షను అతను యిస్తానంటే మీరు యివ్వనంటారని నేను వచ్చేను, సెలవు' అంటూ అతి కోపంగా వెళ్ళిపోయేడు. తనకు నవ్వాలో ఏడవాలో తెలియలేదు.

పది నిముషాల తర్వాత ఆలోచించసాగేదు. ఈ పేషంట్లకి జబ్బు తెలుసు. వాటికి మందులూ తెలుసు! వీళ్ళకి డాక్టరు అవసరం లేనట్టుందే! ఇలా అని గవర్నమెంటుకు తెలియజేస్తే బాగుంది. తెలిపినట్టయితే అయిదేళ్ళకోర్సని, అందులో పరీక్షలనీ, తర్వాత హౌస్‌సర్జరీ పీరియడ్ అనీ— వీటిందుకు విద్యార్థులు తంటాలు పడాలి?

తను మెడికల్ కాలేజీలో చదువుకుంది, యిక్కడ కనిపించేది వేర్వేరే. చేపలు తినడంవల్ల, మూత్రంతో చీము వొస్తుందనీ మొదటిసారి తను వింటున్నాడు. నో గాడ్! చదువుకీ ఈ ప్రాక్టీసుకి ఎక్కడా పొంతన కుదిరేటట్టు లేదు.

ఇదే ఆసుపత్రిలో అయితేనా యీ కేసుని అక్కడే ఆ ఓపిలోనే పదిమంది ముందూ నిలబెట్టి పరీక్షచేసి తర్వాత లాబ్‌లో రక్తం, మూత్రం పరీక్షచేసి, పేషంటు ఒప్పుకోకపోయినా నాలుగు తిట్టి— అతనిచేత నిజం చెప్పించేవారు. అక్కడ జబ్బు గురించి మందిచ్చేవారు— కాని యిక్కడ? జబ్బుకి కాదు. మనిషికి మందియ్యాలి. అతను అబద్ధం ఆడుతున్నాడని తెలిసినా తను 'అవునండీ చేపలవల్లనే వొచ్చిందది సత్యనారాయణగారూ. ఆ మధ్య నాకూ అలానే అయింది. ఏంటో? అన్ని మందులు వేసి ఆర్టిఫిషియల్‌గా తయారవుతున్న యీ వెధవ చేపలు, అందరికీ వేడి చేస్తున్నాయండీ!' అని అతని వెధవ పనిని కప్పిపెట్టి తీయని మాటలతో, ఒక పెన్సిలిన్ పొడిచేసి 'తగ్గిపోతుంది లెండి' అంటే అతను తన దగ్గరికే వొచ్చేవాడు తిరిగి. కాని తను అలా చేయలేదు. అలా చేయడంవల్ల మనిషిని మభ్యపెట్టి రోగాన్ని నివురుకప్పిన నిప్పులా చేస్తున్నాదన్నమాట. దానివల్ల భవిష్యత్తులో వాళ్ళకు ఎంత చేటో... వాళ్ళకు తెలియదు. చెబుదామన్నా వినేస్థితిలో లేరు.

అయినా వీళ్ళు బయట మనిషి దగ్గరికి వెళ్ళడం చెడు అని ఎందుకనుకుంటారు? ప్రతి మనిషి సంపర్కం గురించి కోరుకుంటారు. అది అన్నం తినాలి అనే కోరికంత సహజసిద్ధమైంది. ఇంట్లోనే అందుబాటులో ఉన్నవాళ్ళు ఇంట్లోనే భార్యవద్ద తీర్చుకుంటారు. అది లేనివారు బయటకెళతారు. లేకపోతే యితర పద్ధతుల ద్వారా నెరవేర్చుకుంటారు. ఇలా సత్యనారాయణకి భార్యలేకపోయినా కోర్కెలు ఉండకూడదని లేదా? తను భార్యపోయింది కాబట్టి, కోరికలకు అతీతుడు అనీ ఆత్మవంచన చేసుకుంటూ, అది నమ్మించాలని తనముందు ప్రయత్నిస్తూ— తనో కామోత్తురుడుగా, అన్నీ త్యజించిన విరాగిలా తన ముందు కనిపించాలని- ఆహారంగా ఉపయోగపడే అనీ, తన ప్రాణాలను సహితం అర్పించిన చేపల్ని నిందించడం— మహాపాపం.

'డాక్టరుగారూ! పన్నెండున్నర అయినా యింకా కొట్టు కట్టేయలేదే? వేడి అయిన ఆలోచనల్లో ముఖాన్ని కందగొట్టేసుకున్నారే!' అంటూ విమల ప్రవేశించింది.

'అంత టైము అయిందా' అని తలుపులు మూసేసేడు.

'ఎంత కలక్షనేంటి యీరోజు?' అంది విమల. కావాలి అనుకుంటే ఒక అయిదు సంపాయించే వాడ్నే కాని, సంపాయించలేకపోయేను?



















ప్రతి టార్చి ప్రత్యేకమైన అవసరాన్నిబట్టి
బడ్జెట్ ననుసరించి డిజైను చేయబడినది.
స్త్రీల హేండ్ బ్యాగ్‌లలో చక్కగా
సరిపోయే వివిధ రంగుల చిన్న టార్చిలు.
ముచ్చటైన టార్చిలు పెన్సిళ్ళతో
జాకెట్ పాకెట్‌లో సులువుగా తీసుకు
వెళ్ళేందుకు ఇత్తడి టార్చిలు జీవితకాలానికి నమ్మకంగా
పనిచేస్తాయి. తేలికైన అల్యూమినియం టార్చిలు
చూడటానికి అందమైనవి మరియు సులువైనవి, ఇంకా ఎన్నో!
ఎవరెడి రేంజి నుండి ప్రతి ఒక్కరికి కావల్సినది ఉంది
మీకు కూడాను.




# ఎవరెడి

మీ భద్రతకోసం ఈ రాత్రి మీకు ఎవరెడి టార్చి అవసరమవుతుంది.
అది ఉండటం మీకు చీకట్లో మరో రెండు కళ్లు ఉన్నట్లుగా ఉంటుంది.

# ప్రాక్టీసు పెట్టిచూడు

'ఎందుకేంటి ?'

'ఏంటో విమలా! నేనో క్రొత్త ప్రపంచం లోకి అడుగు పెట్టినట్టుంది. నేను నేర్చుకుంది - ఆలోచించే విధానం — ఆసుపత్రిలో వేరు. కాని యిక్కడో ? అదంతా వ్యతిరేకంగా ఉంది. నేను యీ ప్రాక్టీసుకు పనికిరానేమో అనిపిస్తూంది.'

'ఎందుకేంటి ?'

'ప్రతివాళ్ళనీ సంతృప్తి పరచేందుకే ప్రయత్నించాలి — అన్నట్టు అర్థం అవుతూంది విమలా. నా యిష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా వాళ్ళ మనసుల్ని చూసే నేను మసలుకోవాలి. అలా మసులుకోనేవాళ్ళను ఏం అంటారో తెలుసా ?'

'... ... ... ...'

'ప్రాస్టిట్యూట్స్ అంటారు. తన గురించి వచ్చే విటుల్ని వాళ్ళు వొకరకం బాధతో వొస్తారు అనుకో, ఆ బాధను ఆమె తీర్చి సంతృప్తి పరచాలి. ఇక్కడ విటుల బదులు పేషంట్సు! వీళ్ళొకరకం బాధతో వస్తారు వీళ్ళ బాధ తీర్చి, వీళ్ళకు తృప్తి అయేవిధంగా మసలుకోవాలి. నేను ప్రాస్టిట్యూట్‌లా కాగలనా?' అనే తన నోటిని సుతారంగా వేలితో మూస్తూ 'మరీ అంత ఎక్స్‌ట్రీమ్‌గా ఆలోచించకండి' అని పరిస్థితిని తేలిక చేసేందుకు 'మీరు ప్రొద్దున్న కాఫీ తీసుకొచ్చారు. అందుకే బుర్ర వేడెక్కిపోయింది. రేపటినించి టిఫిన్ చేస్తాను. తిని రండి' అని 'మీకు యిష్టం అయిన ములక్కాడల సాంబార్ అన్నం తెచ్చాను ఇద్దరం తిందాం రండి!' అని కారియర్ తీసి, 'భోజనం చేసేంతరువాత పేక ముక్కలు తెచ్చాను, ఇద్దరం ఆడుకుందాం' అంటూ అన్నీ ప్లేటులో పెట్టసాగింది.

* * *

జేబులో డబ్బులు లేవు కాబట్టి డిస్పెన్సరీ తెరిచేవాకా కొంతసేపు మాట్లాడుతూ, కొంతసేపు పేకాడుతూ కూర్చొని నాలుగింటికి క్లినిక్కు తెరిచేడు. తన టేబిలు మీద కత్తిరించి ఉన్న బొమ్మను చూస్తూ విమల 'నేనిచ్చిన అయిడియా వాడుకున్నారన్నమాట! ఎంత టైము పట్టిందేంటి ?' అంది.

'అరగంట' అన్నాడు.

కత్తిరించిన బొమ్మని చూస్తూ

'యింకొంచెం ప్రేమ తీసుకుని ఉంటే యింకా బాగొచ్చి ఉండేది' అని 'యింకేం అయినా బొమ్మల కాయితాలు ఉంటే యివ్వండి కత్తిరిద్దాం' అంది.

'ఇంకేంలేవు' అన్నాడు.

'అయితే మళ్ళీ పేక ముక్కలు వేసుకుందాం ఏంటి?'

'డిస్పెన్సరీ తెరచి పెట్టి పేకాట ఆడితే ఏం బావుంటుంది సరే. అయితే నువ్వో షోకేస్ బొమ్మలా కూర్చో! నేనూ అలానే కూర్చుంటాను!'

మాటలు వాగ్వివాదంలోకి దిగకుండానే వొక జ్వరంకేసు వచ్చింది. తను 'నీవు పెన్సిలిన్ యింజక్షను తీసుకున్నావేంటి? నీవ్వెడయినా?' అంటూ అడిగేడు. తలూపింది. ఇంజక్షను చేసి మాత్రలు యివ్వగానే 'వింత యిస్తమంటావు?' అని అంది.

'నాలుగు' అన్నాడతను.

'ఏం లేంటి? ఏనభై పైసలకు దొరికే యింజక్షనుకు నువ్వు నాలుగు పుచ్చుకుంటావా! బాగా దోచేయడం బాగుందే! ఆ ప్రక్కవీధి డాక్టరే నయం. క్రొత్తకొత్త ఖరీదయిన యింజక్షన్లిచ్చి అయిదు రూపాయలు తీసుకుంటాడు. నువ్వేమో పెధవ పెన్సిలిన్ యిచ్చేవు. అది యీ కాలం రోగాలకు పనిచేసి ఛస్తేనా' అంటూ నోటి దురుసుతనం చూపిస్తూ లేచి – చేతిలో రెండు రూపాయలు పెట్టి మెట్లు దిగి పోయింది.

'ఏంటండీ! ఆమె అలా మాట్లాడు తుంది?' అంది విమల.

'అది అంతేలే! వాళ్ళంతా మన బాస్‌లు, వాళ్ళేం అన్నా మనం భరించాల్సిందే.'

'ఏమనుకోకపోతే వొక మాట! ఆమె అన్నది నిజమేనా?' అంది.

'ఆ నిజమే. ఆ యింజక్షను ఖరీదు ఏనభై పైసలు. అదీ యెక్కడ? మెడికల్ షాపులో. కాని డాక్టరు దగ్గర నాలుగు రూపాయలు - ఇంజక్షను - ఖరీదుకే చెల్లించటంలేదు. రోగి జబ్బు యిది నిర్ణయించి, దానికి యీ మందు వాడితే మంచిదనే నిర్ణయానికి– వీళ్ళు నాలుగు యిస్తున్నారు. ఇది వీళ్ళకు అర్థంకాదు. చెబితే తెలుసుకోరు.'

తరువాత ఇద్దరూ మౌనంగా ఉండి పోయారు.

అరగంట తర్వాత యింకొకతను వచ్చేడు. అతను మార్కెట్టులో కూలి చేసుకుంటున్నాడు. వస్తూనే 'తనకు కాళ్ళ నొప్పులూ, వొళ్ళు నొప్పులూ' అన్నాడు.

తను పరీక్షచేసి మాత్రలు యివ్వబోతూంటే 'యింజక్షను యివ్వవేంట?' అన్నాడు.

'ఇంజక్షను యెందుకు? డబ్బు దండగ. మాత్రలు వేసుకో– ఇంజక్షనులాగే పని చేస్తుంది.'

'నాకు యింజక్షను యిస్తేనేగాని పని చెయ్యదు. ఇలాంటి మాత్రలు నేను చాలా వాడేను షాపులో కొనుక్కుని.' తగ్గలెదు. నువ్వింజక్షను చేస్తావని వచ్చేను'

కూలివాడి బట్టలు కంపుకొడుతున్నాయి. తను జాలిపడుతూ "నీవు కూలి చేసుకొని మూడో నాలుగో సంపాయిస్తావు. అది యిక్కడ కట్టిపోతే నీ పెళ్ళాం పిల్లలకి ఎలా?"

'నా ప్రాణం కంటే యెక్కువేంటి బాబుగారూ? నేను బాగుంటే చాలా సంపాయిస్తాను-' అంటూ మొండిగా మాట్లాడేడు. 'వచ్చిన అందర్నీ తాలేస్తే– యీ ఖర్చంతా ఎలా? తన ధర్మం చెప్పవెప్పేందుకు ప్రయత్నించి- నెరవేర్చేడు. వాడు వినలేదు. నీ ఖర్మ' అనుకుంటూ వాడికో బీకాంప్లెక్స్ యింజక్షను యిచ్చి మూడు రూపాయలు తీసుకుని పంపించేసేడు.

వీళ్ళకి యింత యింజక్షను మేనియా ఎందుకో? అతి సాధారణమైన బాధలకి కూడా యింజక్షను కావాలంటారు వాళ్ళకు యింజక్షనే తప్ప మరింకేం మందేకాదు.

మరో అరగంటకు మరో కేసు.

ఈ కేసు లావుగా నల్లగా వుంది. వయసు ముప్పై ముప్పై అయిదు మధ్యలో ఉండొచ్చు. ఇంజక్షను బాటిలు తనకు అందిస్తూ 'మా ఊళ్ళో యీ యింజక్షన్ను చేయించుకొమ్మని రాసి యిచ్చేరండి- మీరు చేస్తారా?' అంది. 'చేస్తానమ్మా' అని 'యిదివరకు యెప్పుడైనా యీ యింజక్షను చేయించుకున్నావా?' అన్నాడు. 'బోలెడు' అని 'యిది ముక్కుకు చేయాలి' అంది ఆమె.

'సరే లోపలికివెళ్ళి పడుకోండి' అని తను యింజక్షను సిరంజిలోకి యెక్కించి లోనికి వెళ్ళేడు. వెళ్ళినవాడు షాక్ తిన్నవాడిలా వెనక్కి తిరిగి 'అమ్మా అలా చీరను క్రిందకించి తొంటిపైకా మీది కెత్తడం కాదమ్మా! నడుందగ్గర పొడులుచేయాలి?'

'మావూరి డాక్టరు యిలానే చేసేవాడు' అని 'నడుందగ్గర ముడివిప్పి బట్ట పొడులు చేయాలంటే కష్టం అండీ, యిలానే చేసేయండి ఫర్వాలేదు' అంది.

తను బయటికి వొచ్చి 'విమలా! నువ్వెళ్ళి కాస్త ఆమెచేత నడుందగ్గర బట్ట కాస్త జరిపించు' అన్నాడు.

ఎలాగో ఆమెకు యింజక్షను చేసి పంపే టప్పటికి తల ప్రాణం తోకకి వచ్చింది.

వెళ్ళేముందు రూపాయి చేతికిచ్చి అనంతృప్తి నిండిన ముఖంతో కదిలిపోయింది.

(ఇంకా వుంది)



# సామెతల కథలు

మనం చేయవల్సినది, మన ప్రమేయం లేకుండానే మరొకరు పూర్తి చేసారు అని చెప్పటానికి ఈ పలుకుబడిని ఉపయోగిస్తారు.

పాండవులు అరణ్యవాస సమయంలో ద్వైతవనములో నివసిస్తుండగా దుర్యోధనుడు, తన వైభవాన్ని చూపించి వారిని కించపర్చాలనుకున్నాడు. ద్వైతవనములోని, తమ పశువులను క్రూరమృగాలు నాశనం చేస్తున్నాయనీ, ఆ మృగాలను చంపి వాటి బారినుండి పశువులను రక్షించాలనీ, అందువల్ల తను ద్వైతవనానికి వెళ్ళుతున్నట్టు దుర్యోధనుడు, తన తండ్రి ధృతరాష్ట్రునికి చెప్పాడు. ఇదొకసాకూ, అబద్ధం అనిపాపం ధృతరాష్ట్రునికి తెలియదు.

దుర్యోధనుడు, సైన్యంతో కర్ణాదులను తీసుకుని ద్వైతవనానికి బయలుదేరి వెళ్ళాడు. కొంచెంసేపు ఆ వనంలో వేటాడారు. అక్కడ ఉన్న గంధర్వుల కొలను ఒడ్డున మకాంవేసి, ఆ కొలనులో స్నానమాడ నిశ్చయించి, ముందుగా సైన్యాన్ని పంపించాడు. ఆ కొలనుకు దగ్గర్లోనే, పాండవుల మకాంకూడాను.

ఆ కొలను వద్దనున్న గంధర్వరాజు చిత్రసేనుడూ, గంధర్వులూ కల్సి కౌరవసేనను చెండాడారు. వాళ్ళు పారిపోయి దుర్యోధనునకు మొరపెట్టుకున్నారు. దుర్యోధనుడూ, కర్ణుడూ యుద్ధసన్నద్ధులై చిత్రసేనునిపై దండెత్తారు. గంధర్వులకూ, కౌరవులకు యుద్ధం జరిగింది. కౌరవసేన చెల్లాచెదురయ్యింది. చిత్రసేనుడు, దుర్యోధనుని కాళ్ళూ, చేతులూ కట్టి తన రథంపై పడేసాడు. పారిపోయిన కౌరవసేన దగ్గరలో ఉన్న పాండవుల నివాసంవద్దకెళ్ళి, ధర్మరాజుకు తమకు కల్గిన దుర్గతిని గురించి చెప్పారు. దుర్యోధనుని గురించి ధర్మరాజు బాధపడ్డాడు.

అప్పుడు ధర్మరాజు భీముణ్ని పిలిచి, వెళ్ళి వెంటనే దుర్యోధనుని విడిపించమని చెప్పాడు. భీముడు దుర్యోధనుని దుర్గతికి సంతోషించాడు గాని విచారించ లేదు.

# కాగల కార్యం గంధర్వులే గావించారు




పైగా ధర్మరాజుతో భీముడు "కాగల కార్యం గంధర్వులే కావించారు. మనం చేయవల్సిన పని వాళ్ళే చేసారు. మనను కించపర్చాలని దురుద్దేశంతో వచ్చిన అతడికి తగిన శాస్తి జరిగింది. గంధర్వులు మంచిపని చేసారు..." అన్నాడు. ధర్మరాజుకు కష్టంవేసింది.

"అలా అనుకోవటం తప్పు. అతడు మన సోదరుడు. అతడు వీలాంటి వాడైనా, అతడికి అవమానం జరిగితే మనకూ జరిగి నట్టే" అంటూ ధర్మరాజు భీముడికి నచ్చ జెప్పాడు. అంతలో దుర్యోధనుడు బాధగా అరచిన అరుపు వినిపించింది. ధర్మరాజా దానిని భరించలేక, భీముణ్ని, అర్జునుణ్ని వెళ్ళి వెంటనే, గంధర్వుల బారినుండి దుర్యోధనుణ్ని విడిపించమన్నాడు. వారు అన్న ఆజ్ఞను శిరసావహించారు.

ఆనాడు, అలా పట్టరాని కోపంతో, ద్వేషంతో భీముడు అన్నది పలుకుబడిగా ఈనాటికి, మనం వాడుకలోనే ఉంది.

— పద్మావతి గంగాధర్







# ఫ్లాష్‌బ్యాక్.

రంగారావు

ఉయ్యూరు ప్రయాణం. చాల రోజుల తరువాత బస్సు ప్రయాణం. ప్రతి శనివారం ఉయ్యూరు నించి నా ఫ్రెండ్ డా. శివరాం విజయవాడ వస్తాడు. ఆదివారం అంతా సరదగా గడిపేసి సాయంత్రానికి ఉయ్యూరు వెళ్తుంటాడు.

బ్రహ్మచారులయితే ఈ విధానం సాధారణమేగానీ, పెళ్ళిళ్ళయి తండ్రులయ్యాక కూడా ఇదేరకంగా మా స్నేహం కొనసాగుతూందంటే గొప్ప విషయమేగా!

"ఏదే వదే నేనే విజయవాడ వస్తోంటే మాయావిడ నిజంగానే అనుమాన పడుతుంది గూడా! ఒక్కసారైనా నువ్వొచ్చి మాయావిడ ఆతిథ్యం స్వీకరించరా గాడిదా!" అంటూ వాడు గోల.

కాస్త రిలీఫ్‌గా ఉంటుందని బయలుదేరాను. బస్సులో నిండా మనుషులు, బస్టాండులో బంగాళాదుంపల్లాగా. శని ఆదివారాల శలవలు కలిసొచ్చాయేమో అటువేపు వాళ్ళంతా స్వంత స్థలాలకు బయలుదేరారు.

ఇప్పుడెక్కడికి పోతుందో ఆడా మగా తేడా! తెలిసిన మగాళ్ళు ఇంటికొస్తే వంటింట్లోకి పరిగెత్తే ఆడాళ్ళు తోసుకుని తోసుకుని బస్సెక్కుతున్నారు. అలా దౌరవగా లోపలికి రాలేని వాళ్ళ మీద వాళ్ళ మొగుళ్ళ విసుక్కుంటున్నారు.

చంకలో పిల్లలు – చేతుల్లో పిల్లలు, కొందరికి పొట్టల్లో పిల్లలు. అబ్బబ్బ ఈ ఆడవాళ్ళ పాపం అనిపించింది.

పదేళ్ళ నాడు కూడా ఇంత రద్దీ ఉండేది కాదు.

అంతమందిలోనూ నా దృష్టి ఒకతని మీద నిల్చి పోయింది. విజయవాడలో బస్సెక్కాడు. కంకిపాడుకి టిక్కెట్టు కొన్నాడు. చేతిలో ఓ పెట్టె చిన్నది, రేకుది పాతది. అపురూపదంగా తెచ్చి సామాన్లు పెట్టుకునే రాక మీద పెట్టాడు.

అంతగా అతను నా దృష్టిలో పడడానికి కారణం బహుశా అతను నా ప్రక్కనే కూర్చోవడం వల్లనేమో! పైగా అతని తీరుకూడా ఆదరకంగా వుంది. పంచె చొక్కాలో ముతక వేషంలో బొత్తిగా నాటుగావున్నా, మొహం మాత్రం నాజూగ్గా ఉంది. అలాంటి వాళ్ళు శారీరకంగా కూడా పనిచేసో, మరి ఆహార లోపాలవల్లో కరుగ్గా ఉంటారు. అతను అలా లేడు.

ఇంతటితో నా ఆలోచన ఆగిపోయింది.

మొక్కజొన్నపొత్తులు – చెరుగ్గడల – గుంటూరు జిల్లాకు విభిన్నంగా ఇక్కడ మరో రకం సంస్కృతి. చిన్న చిన్న తేడాలతో కనిపిస్తుంది. నా ఆలోచనలు ప్రాంతీయతలూ క్షణ క్షణానికీ మారుతున్న ఈ సమాజం మీదకు పోయాయి.

బ్రేము పరుగెత్తింది కంకిపాడు రానే వచ్చింది. నా ప్రక్క వతనెవ్వ డెళ్ళాడో ముందుకెళ్ళి తను పెట్టె పెట్టిన చోటు వెదుకుతున్నాడు. మొహంలో కంగారు. "నా పెట్టె! నా పెట్టె!" గొణుక్కుంటూ వెదుకుతున్నాడు. అతనికళ్ళల్లో దీనత్వం ఉన్నట్టుండి వచ్చేసింది. చేతులు వణుకుతున్నాయి.

అందరూ దిగిపోయారు. కండక్టరు, "దిగవయ్యా ఏంటింకా!" గదిమాడు.

"నా పెట్టె! నా పెట్టెండి!" ఈసారి గొంతు బిగ్గరగా వినిపించింది. "పెట్టా! ఏం పెట్టె!" ఒకటి రెండు గొంతులు.

అప్పటికే ఓవర్ లోడయిందని ఎవరినీ ఎక్కనివ్వడంలేదు. డ్రైవరు బస్సు స్టార్టు చెయ్యడానికి రెడీగా ఉన్నాడు.

"బాబూ నా పెట్టె. నా పెట్టె" అంటూ మొదలెట్టి గుండెలవిసేలట్టు ఏడవడం సాగించాడు. ∎

## ఉత్తరాలు: పాఠకులకు మనవి

* ఉత్తరాలు స్పష్టంగా తెలుగులో వ్రాసి చివర స్పష్టంగా తమ పేరు చిరునామా వ్రాయాలి.
* సంతకాలు పెడితే పేరు అర్థం కాదు కనుక దాని క్రింద పూర్తి పేరు కూడా వ్రాయాలి.
* ఉత్తరాలు తిప్పి పంపమంటూ కొందరు స్టాంపు బిళ్ళలు పంపుతున్నారు. ఉత్తరాలు తిప్పి పంపడం సాధ్యం కాదు.
* వచ్చిన అన్ని ఉత్తరాలు వేయడం ఎప్పుడూ సాధ్యం కాదు. కొన్నింటిని సంక్షిప్తం చేసి వేయవలసి ఉంటుంది. కూడా. ఏ ఉత్తరమైనా వ్రాసేవారి చిరునామాలో కూడా ఉండటం అవసరం. — సం.





## ఫ్లాష్ బ్యాక్

ఇతని కంగారు బస్సులో జనానికి అర్థమైపోయింది. ఇప్పుడు జనమూ లేచి నుంచుండిపోయారు.

అతను గుమ్మం దగ్గర కూచుని ఏడుస్తున్నాడు. క్రిందివాళ్ళు పైకి రాలేరు. పైవాళ్ళు క్రిందికి దిగలేరు.

"పాపం! పెట్టె పోయిందట. అందులో ఏముందో." అని ఒకరూ,

"ఎక్కడ ఎక్కాడో" అని ఒకరూ రకరకాల వ్యాఖ్యానాలు, రకరకాల భావాలు. డ్రైవరూ కండక్టరూ కూడా అతని దగ్గరకు చేరి అసలు విషయం రాబట్టడానికి ప్రయత్నిస్తున్నారు.

అంతా గందరగోళంగా వుంది.

ఏమీ వినపడదు. నాకు మధ్య సీట్లలో ఉన్నానేమో అసలు కనిపించడంలేదు.

అతను అతి దారుణంగా ఏడుస్తున్నాడు. అతికష్టం మీద అర్థమైంది — అతను విజయవాడలో తన బంగారం అమ్మి ఐదువందల రూపాయలు తెచ్చుకుంటున్నాడు.

అతిగోలగా ఏడుస్తున్నాడు. అక్కణ్ణించి కదలడంలేదు. బస్సులో పిల్లల గోల, గాలి రాక. ఊపిరాడ్డం లేదు.

ఇంతలో ఒకాయన నల్లకళ్ళద్దాలూ అవీ బాగా దర్జాగా ఉన్నాడు.

నా వెనక సీట్లోంచి అందర్నీ తోసుకుంటూ ముందుకెళ్ళాడు. "ఏమిటయ్యా, ఇంతకి పోతే ఏంచెయ్యమంటావ్?" గద్దించాడు. అంతా నిశ్శబ్దమైపోయింది ఒక్కసారిగా.

"బాబూ! నా పెళ్ళానికి పెద్దరోగం బాబూ! చిన్నం చితకా అమ్మి 500రు.లు తెచ్చుకున్నాను బాబూ, దానికాపరేషను చేయించాలని, ఇంక నా పెళ్ళాం నచ్చిపోద్ది. నా పిల్లలకి దిక్కులేదు." అతి దీనంగా ఏడుస్తున్నాడు.

అంత గట్టిగా గద్దించిన ఆ పెద్ద మనిషి నీరుకారిపోయాడు ఇతని ఏడుపుకి.

"ఏంచేద్దాం! పాపం" ఓదార్పుగా ఓ మాట జనాంతికంగా అన్నాడు.

మళ్ళీ ఆయనే "పోనీ తలాకాస్త ఇస్తాం. వచ్చినంత మటుకు తీసుకో. మిగతాది నీ ఖర్మ పాపం, ఏంచేస్తాం మరి" అంటూ "ఏవండీ! అలాచేద్దాం, పాపం ఏడుస్తున్నాడు." అన్నాడు మళ్ళీ జనాంతికంగా.

అతని స్థితి అందర్నీ కదిలించింది.

"ఏడవకు మరి. తలాకాస్త ఇస్తాం" జేబులోంచి అయిదు రూపాయల నోటు తీసి ఇచ్చాడు.

టకటకా అందరూ కాస్త కూస్త ఇచ్చారు. చిల్లరడబ్బులుమాత్రం రాలలేదు. అన్నీ నోట్లే. భిక్షగా కాకుండా సహాయంగానే పరిగణించారు జనం. మరి కాస్త పుణ్యంమీద ఆశ ఉన్నవాళ్ళు 10 కాయితాలు కూడా ఇచ్చారు. మొత్తానికి రెండువందల చిల్లర వసూలైంది. మరి శిబి, బలి లాంటి వారు పుట్టిన దేశం కదా ఇది.

ఈ నల్లకళ్ళద్దాలు ప్రక్క బస్సులోకి కూడా తొంగిచూచి "పాపం! ఇతని డబ్బు పోయింది. భార్య జబ్బులో వుందట. నేమంతా తలా కాస్త ఇచ్చాం. మీరూ కొంచెం ఇవ్వండి." అని ఓ ఉచిత సలహా పారేశాడు.

అతను నెమ్మదిగా దిగిపోయాడు. దారి క్లియర్ అయింది. బస్సు సాగింది.

అన్నట్టు నేనూ ఓ అయిదు రూపాయిలిచ్చాను.

నా ఉయ్యూరు ప్రయాణంలో తెలుసుకోకుండా పుణ్యం సంపాయించుకున్న తృప్తి మిగిలింది.

నాల్రోజులు హాయిగా గడిపేసి, వియ్యంకుడిలాగ మహాదర్జాగా బయల్దేరాను విజయవాడకు.

మళ్ళీ పిల్లా, పీచూ, యిల్లూ, ఆఫీసూ, భార్యా, మార్కెట్టూ తయారు.

నాల్రోజులు రెస్టుకి ప్రతిఫలంగా మా ఆవిడమర్నాడు "సొమ్మొకడది సోకొకడిది" సినిమా ప్రపోజల్ పెట్టింది.

ఏం చేస్తాం మరి, కమల్‌హాసన్ వేవ్‌లో ఉన్నారు జనం.

నాముందే కమల్‌హాసన్‌ని—నిన్నగాక మొన్న విగ సాలొచ్చినవాణ్ణి—తల్చుకుని పొగుడుకుంటుంటే ఓర్చుకుని—సహించి సినిమాకు బయల్దేరాను.

"హౌస్‌ఫుల్" బోర్డు. మా యావిడ సణుగుడు.

రిక్షా ఖర్చులతో సహా లెక్కేస్తే — మళ్ళీ యీ సినిమాకి రావాలంటే తడిసి ముప్పందుం అవుతుంది. బ్లాకే సుఖ

అనుకునేంతలో "మూడురూపాయలు — అయిదు రూపాయలు" "మూడు రూపాయలు-ఐదు రూపాయలు" అరిగిపోయిన రికార్డులా నా చెవిదగ్గర.

తల తిప్పిచూశాను నోరు కట్టేసి కదప కుండా నా పక్కనే ఉన్నారు. మా 'యావిడ గుడ్లురుముతోంది ఇంకా ఏమిటాలస్యం అన్నట్టు.



జీవిత బీమా (బొంబాయి) చైర్మన్ శ్రీ జె. ముక్తార్ ఇటీవల విజయవాడలో చైర్మన్ క్లబ్ సభ్యుడైన శ్రీ యు. మధుసూదనరావుకు బంగారు పతకాన్ని బహూకరించారు.

# ఫ్లాష్ బ్యాక్

ఆటోమాటిక్‌గా చేతులు జేబులోకి వెళ్ళిపోయాయి. టికెట్లు నా చేతిలోకి పదిరూపాయల నోటు వాళ్ల చేతుల్లోకి.

"ఏమయ్యా! నిజమైన టికెట్లేనా?" అన్నాను.

"అలా మోసం చెయ్యంసార్. కావాలంటే అమ్మగార్ని ఇక్కడే ఉంచి మీరు సీట్లు చూసుకు రండి." అన్నారు సత్యహరిశ్చంద్రుడి సెల్లెల్లో.

వీళ మొహాలు...ఎక్కడో... ఎప్పుడో...

"పదండి" ఒక్క ఉరుము ఉరిమింది.

గుడ్లురుముతున్న శ్రీమతి. ముందు హాల్లోకి వెళ్ళి శుభంపలికి గుడ్లురుమడం దిగకగానీ బయటికి రాదు మా శ్రీమతి.

కమల్ హాసన్ తెగ నవ్విస్తున్నాడు.

బ్లాకు టికెట్లమ్మిన వాళ్ల మొహాలు పదేపదే గుర్తొస్తున్నాయి.

సినిమాలో మా మోసం ఉందిగనీ దాన్ని జోక్‌గా మలచిన దర్శకుడి ప్రతిభను మెచ్చు కోవచ్చు.



రాజాలక్ష్మి ఫౌండేషన్ తరఫున 10 వేల రూపాయలు సాహిత్య నగదు బహుమతిని ఏర్పాటు చేసి, నవంబర్ 10 న దానిని "శ్రీ శ్రీ"కి బహూకరణ చేసిన శ్రీ పి. వి. రమణయ్య రాజా.

సినిమా—మధ్యలో వాళ్ళ మొహాలు.

ఈ ఆలోచనల గోల పడలేక కావాలని ఫుల్ స్టాపు పెట్టాను. సినిమా తెలియ పోయింది.

రిక్షా ఎక్కుతున్నాం.

ఇందాక బ్లాక్ టిక్కెట్లమ్మిన వాళ్ళు. ఒకడి చేతిలో టికెట్లు, మరొకడు "టికె ట్లయిపోయాయి సార్. మూడు రూపాల టికెట్లు ఆర్రూపాయలకైతే దొరుకు తున్నాయి" అంటున్నాడు. అక్కడే కాస్త దూరంలో నిలబడి.

తిరుపతిలో నా ఉయ్యూరు ప్రయాణం, జబ్బుపెళ్లాం మొగుడు, డబ్బు పోగొట్టు కోవడం, ఆ నాజూకు మొహం, అతని ఏడుపు, వళ్ళు కళ్ళద్దాలు—అతని దొంగతనాలు ఇవన్నీ సినిమా ఫ్లాష్ బ్యాక్‌లా నా బుర్రలో ఒక్కసారి గిర్రున తిరిగాయి.

మళ్ళీ వాళ్ళవంక చూశాను.

సందేహం లేదు. ఫ్లాష్ బ్యాక్ ఫ్లాష్‌బ్యాకే.




Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna




# డిపీస్ జామ్ వేటితో తయారవుతోందా తెలుసా?

పంచ్‌గని స్ట్రాబెర్రీలు, రత్నగిరి మామిడి పళ్లు,
అలహాబాద్ జామ పళ్లు, త్రిచూర్ అనాస పనస
పళ్లు, [illegible] బొప్పాయి పళ్లు, జల్‌గావ్ అరటి
పళ్లు, సూర్య రస్మిలో అరముగ్గిన ఉత్తమ జాతుల పళ్ల
లోని శ్రేష్టత్వాన్నంతా నింపుకొన్న రమ్య రసమయం
డిపీస్ మిక్స్‌డ్ ఫ్రూట్ జామ్.

డిపీస్ అంటే అత్యుత్తమ రుచికి పెట్టింది పేరు.

డిపీస్ జాములు: ఏప్రికాట్, మేంగో (మామిడి పండు), మిక్స్‌డ్ ఫ్రూట్,
పైనాపిల్ (అనాస పనస), రాస్ప్‌బెర్రీ, స్ట్రాబెర్రీ, ఆరెంజ్ మార్మలేడ్,
గ్వావా (జామ పండు) జెల్లీ.



## డిపీస్ జాములు- ఓ ఫలవంత మైన అనుభవం